శ్రీరామ.

# దేవాలయతత్త్వము.

వావిలికొలను సుబ్బరాయ

విరచితము.



మొదటి కూర్పు, ౧౦౦౦ ప్రతులు.

చెన్నపురి:

బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౯౨౭.

వెల, ౧౨ అణాలు.

# ఆంధ్రవాల్మీకి వాసుదాసుఁడు.



శ్రీమదొంటిమిట్ట కోదండరామాలయోద్ధారణమునకై దీక్షవహించుట.



శ్రీరామాయనమః.

# దేవాలయతత్త్వపీఠిక.

మ. వినుమంభోజభవుండు మున్ను మదిలో వేదంబు ము
మ్మాటు నె। మ్మనమందుం దలపోసి యెంతయుఁ బరా
మర్శించి మోక్షంబు ద।క్కనమార్గంబున వెంట లేదనుచు
భక్తింజింతచేసెన్ జనా। ర్దను నాత్మాకృతి నిర్వికారుఁ డగు
చున్ దన్మార్గనిర్ణేతయై. భాగ. ౨ స్కం.

ఈ గ్రంథోత్పత్తికారణము గ్రంథమున ౮-౯ పుటలయందు వ్రాసితిని. ఇష్టమృష్టాన్నమును సంపాదించి తినలేనివా రాకులలములు నాగజెముడుపండ్లు తిని బ్రతికినట్లు త్రోవ తెలియనివారు ముండ్లు ఱాలు కంపలు త్రొక్కినట్లు నిర్మల భక్తి సాధింపలేనివారు పరమార్గంబుల వెంటఁబోయి శ్రమించి తుదకు శ్రమమే ఫలముగాఁ జత్తురు. ఇందుఁ బెక్కురు శిశ్నోదరపరాయణులు. లోకవంచనము వీరివృత్తి. అంతయైన మేలే. మీఁదు మిక్కిలి భక్తి నిష్ప్రయోజనమని, విగ్రహారాధనము వ్యర్థమని, భక్తుల నాక్షేపించుచుందురు. తెలియనివారు, ముఖ్యముగ స్త్రీలు, వీరి మోసపుమాటలకు బేలుపోయి

ధనము-శీలము వీరివాత నిడి నీళ్లు పోయుచున్నారు. అవురా కలి మహిమ. వాస్తవము తెలిపినయెడల నొకరిద్దఱయిన బాగుపడ రాయని నే నీ శ్రమముపడఁ బూనితిని. భక్తపక్షపాతి భగవంతుఁడే శరణము.

## విగ్రహారాధకులు మందబుద్ధులా?

విగ్రహారాధకులు మందబుద్ధులనువారి వాద మెంతమాత్రము సత్యమో విచారింపవలసియున్నది. విగ్రహారాధన మావశ్యకమని నాకంటె గొప్పవా రనేకులు వ్రాసియున్నారు కావున నేను విస్తరించి వ్రాయవలసినది లేదు.

విగ్రహారాధన విషయమున నాక్షేపములు రెండు. ఆకారము లేని దేవునికి నాకారములు గల్పించుట, లోహదారుపాషాణాదులను దేవుఁడని పూజించుట. ఇవి విగ్రహారాధన విషయమున వాస్తవార్థము తెలియనివారు చేయు నాక్షేపములు. కొందఱు విగ్రహారాధనమును నిషేధింపకయు నది నికృష్టమనియు సర్వాంతర్యామియగు సర్వేశ్వరుని మానసిక ధ్యానమే యుత్కృష్టమనియుఁ గావున నదియే కర్తవ్యమనియు నందురు.

ఇఁక విగ్రహారాధకుల యభిప్రాయ మేమన:—

కర్మయోగియైనను జ్ఞానయోగియైనను భక్తియోగియైనను సాయుజ్యదశ ప్రాప్తించువఱకు నైనఁ దాను వేఱనియుఁ దాను యజించు ధ్యానించు భజించు నీశ్వరుఁడు వేఱనియు భావముకలవాఁడయియే యుండుననుగాని దానికంటె భిన్నమైన యభిప్రాయము వహించుటకు సాధ్యపడదు. కర్మయోగంబునఁ

దాను గర్మములు చేయువాఁడనియుఁ, గర్మములు చేయించుకొను వాఁడీశ్వరుఁడనియుఁ దలఁచి యీశ్వర ప్రీతికై తాను గర్మములు చేయును. అట్లులే జ్ఞానయోగమందును జ్ఞాత వేఱు జ్ఞేయము వేఱు. భక్తియోగంబందును భజించువాఁడు వేఱు భజింపఁ బడువాఁడు వేఱు. తన్నుఁదాను దెలిసికొనుట యనునది యాత్మ సాక్షాత్కార విషయమేకాని భగవత్సాక్షాత్కార విషయము గాదు. ఆత్మావలోకనపరునకుఁ గైవల్యము మాత్రమే ఫలము. ఇందానందము మగఁడు లేక తక్కిన యన్నిభోగములు గల స్త్రీల యానందమువంటిది. భగవదాలోకనపరునకు సాయుజ్యప్రాప్తి. భగవంతు ననుభవించు మహానందము వీనికిమాత్రమే గలదు. పాషాణత్వము శూన్యత్వము నిర్వాణమనువారి మతంబులఁ దక్కఁ దక్కినయందఱ మతమున మోక్షదశయందు నానందానుభవము గలదు. ఇందును గొందఱమతమున నానంద మనుభవించువారికి భిన్నస్థితియుఁ గలదు.

కావున నేమతమందైనను దేహమువిడిచి ముక్తుఁడగు వఱకు ద్వైతము రాకతప్పదు. అంతవఱకు ముముక్షువునకీశ్వరారాధనము తప్పదుగదా. అది చేయు టెట్లు? మానసికముగ నైనఁ జేయవలయును. బాహిరముగనైనఁ జేయవలయును. మానసికారాధనమునకే యంతర్యాగమని పేరు. ఆత్మావలోకన మయినవానికే కేవల మంతర్యాగము విధింపఁబడినది. తక్కిన వారికందఱకు బాహ్యయాగ మవశ్యకార్యము. బాహ్య యాగమే చేయువానికి నాత్మావలోకనప్రాప్తి యెట్లగునందు

రేమో. ప్రతిదినము బాహ్యయాగము చేయుటకుముం దంత ర్యాగము చేయవలయుననియు, మానసికారాధన మయినపిమ్మ టనే బాహ్యయాగము కర్తవ్యమనియు శాస్త్రములు విధించుచు న్నవి. అంతర్యాగముచేసి «భగవన్ పుండరీకాక్ష, హృద్యాగంతుమయాకృతమ్। ఆత్మసాక్షాత్కరుదేవేశ బాహ్యేత్వాంసమ్య గర్చయే» యని విన్నవించి తదనుమతి బాహ్యపూజఁ గావింప వలయు. ఇట్లు రెండును జేయువానికిఁ గాలాంతరమున నంత ర్యామి సాక్షాత్కరించును. నిలుకడగా నిలిచి పూజగొనును. ఆవల వాఁడు బాహ్యపూజ చేయకున్నను దోషము లేదు. అంతవఱకుఁ జేయకుండినఁ బ్రత్యవాయము కలదు. అవ లోకన మగువఱకు నన్వేషణమందే కాలము సరిపోవ నిఁక నెవరిని ధ్యానించినట్టు లెవరిని బ్రత్యక్షముగఁ బూజించినట్టు? అటుగాక సర్వాత్మకబ్రహ్మానుభవము గలుగువఱకు నోసర్వే శ్వరా యో సర్వవ్యాపీ యో సర్వశక్తా యో సర్వజ్ఞా యని యూరక చేయు వాచాకైంకర్య మరణ్యరోదనమే కదా? ఇట్లర ణ్యరోదనముచేసిన గజేంద్రునకు భగవంతుఁడు సాక్షాత్కరించి యతని రక్షింపలేదా యందురేమో. సత్యము. గజేంద్రుఁడు పూర్వజన్మమున రాజుగా నున్నప్పుడే యతనికి నాత్మావలోకనము సిద్ధించెను. అట్టులు సమాధినున్న కాలముననే యగస్త్యుఁడు వచ్చి శపించెను. కావున గజేంద్రుఁడుగా జన్మించి పశువాటచే బాహ్యపూజగాని మానసికపూజగాని చేయకున్నను బూర్వ జన్మ వాసనాబలమున భక్తిపూర్ణుఁడై యుండుటచేతనే యా

దశయుం దట్టి మహాఫలము లభించెను. కన్నులకుఁ గానవచ్చు పదార్థము నందుఁ బట్టుమని పదినిమిషములు మనస్సు నిలుపఁ జాలనివాఁడు కన్నులకుఁ గానరానిదానియందు మనస్సు నిలిపెద నన్నమాటయు వంధ్యాపుత్త్రుఁడీయఁగా నాకాశపుష్పం బుట నేను శిరస్సున ధరించితినని చెప్పుటయుఁ దుల్యములూ స్థూలమై దృశ్యమైన లక్ష్యమును భేదింపలేనివాఁడు కనులకుఁ గానరాని లక్ష్యమును శబ్దవేధులచే భేదింపఁగలనని బుద్ధిమంతుఁ డెవ్వఁడు నమ్మును? ఇతర నక్షత్రములఁ జూపక యరుంధతిని నెవ్వరైనఁ జూపఁగలరా. క్షేత్రగణితమున బిందువును జూచుటెట్లు? "పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యాప్రయచ్ఛతి" యనిన శ్రీకృష్ణభగవానుల వాక్యము బాహ్యపూజను గాకున్న మఱేదేనిని శాసించును. "యోయో యాంయాం తనుంభక్త్యాశ్రద్ధయార్చితు మిచ్ఛతి" యనునది సాకారమూర్తి పూజనుగాక మఱిదేనిని విధించును? కావున నాత్మదర్శికిఁదప్పఁ దక్కిన యందఱకు బాహ్యమూర్తిపూజ యనివార్యము. ప్రతిదినకార్యము. మహాయోగిభర్తృహరి కడపటి దశవఱకు విగ్రహారాధనము శాసించెను. కావించెను. శివపూజాపద్ధతిఁ జూడుఁడు.

అగ్నిహోత్రుని సూర్యుని బూజించువారు కనులకు గోచరించు భౌతికపదార్థమును బూజించుచున్నారా? లేక తదంతర్యామి భగవంతు నర్చించుచున్నారా? అంతర్యామి పూజయందు లేని భగవంతుఁ డంతర్యామియై కొన్నిటనుం

కొన్నిట లేఁడా? అన్నిట నున్నాఁ డనుజ్ఞానముగలిగినచో భగవద్భావనతో దేనినిబూజించిన నేమిదోషము? భగవద్భావనయు నథ్యవసాయము ప్రధానములుగాని పదార్థములుగావు. భగవంతుఁ డను తలంపుతో దేనిని బూజించినను దోషము లేదు.

ఇఁక నిరవయవుఁడగు భగవంతునకు మనవలె నవయవకల్పనము శ్లాఘ్యమా? విచారింతము.

క్రైస్తవులు తనవలె దేవుఁడు మనుష్యుని సృష్టించెనని చెప్పుదురుగాని యది సరిగాదు. తనవలెమనుష్యులను సృజించెనేని గాడిదలను గుక్కలను జెట్లను గుట్టలను నెవరు సృజించిరి.? వాస్తవమారయ మనవలె దేవుని మనము సృజించుచున్నాము. మనుష్యులు దేవునిఁ దలంపవలయుననిన మనుష్యునిగాఁ దలంపవలయునే కాని మనస్సెఱుఁగని రూపమున ధ్యానించుటకు సాధ్యపడదు. కుక్క దేవుని ధ్యానింపవలసియుండినయెడల గుక్కగానే ధ్యానింపవలయును. మనశ్శక్తి యంతమాత్రమే, ఈ విషయమై కృష్ణావతారతత్త్వమందు వ్రాసియున్నాను గావునఁ జర్వితచర్వణమేల? క్షేత్రగణితమందు బిందువుఁ (Point) నెట్టిదని నోరఁజెప్పుదుఁ నెట్టిదిగ వ్రాయుచున్నారు? అవిభజ్యము నిరాకారమునగు బిందువును జుక్కగా వ్రాసి చూపుటతగునా?

కావున మనుష్యులు మనుష్యస్వరూపునిగనే దేవుని ధ్యానింపవలయును. పురుషసూక్తమున భగవంతునకుఁ దల కన్నులు లోనైన యవయవములు చెప్పఁబడియెనుగదా. ఇక్ష్వాకుల

యింట శ్రీమన్నారాయణుఁడు రంగనాథాకారముతోఁ గదా నర్చింపఁ బడుచుండెను. సీతారాములు లక్ష్మీనారాయణమూర్తులఁ బూజించునట్లు వాల్మీకిరామాయణమునఁ గలదుకదా. అంతతోఁ బోయినమేలే. సీతాదేవి చెట్లకు నదులకుఁ గూడ నమస్కరించెఁ గదా. మార్కండేయుఁడు శివలింగమును బూజించె. గోపికలిసుక పిడుచలఁ గాత్యాయినిఁ బూజించిరి. ఇంతయేల భక్తిమార్గమున నడచినవారందఱు విగ్రహముల నారాధించి యిష్టసిద్ధిని బొందినవారే. విగ్రహారాధనము నాక్షేపించువారు కూడఁ బంజానో క్రాసునో దేనినో యొకదానిని లక్ష్యముగ నుంచుకొనుచున్నవారే. వీర్లు నరశవప్రతినిధులు కావా? కావున విగ్రహారాధనముచేయువారు మతిహీనులుగారు. తమశక్తియుఁ గార్యసాధనమార్గము నాలోచించియే చేయుచున్నారు. దానివలన శుభఫలము ననుభవించుచున్నారు. జ్ఞానములేకున్నను జ్ఞానులమనుకొని శక్తికిమించిన కార్యమునకుఁబూని తత్ప్రతిపత్తులే దురభిమానంబునఁ జెడుచున్నారు. వారి వారి శక్తిసామర్థ్యము లాలోచించియే యోగ్యతకుఁ దగినట్లు పూర్వులు కృత్యములను నియమించిరి. అది తెలిసికొనలేనివారు పాలు జీర్ణించుకొనలేనివారు సంకటితిని చచ్చినట్లు లుత్తముల ననిపించుకోఁ గోరి శక్తికిమించిన కార్యములకుఁ బూని చెడుదురు. అల్లా దేవతలతో మాట్లాడినట్లు తురుష్కుల గ్రంథములందు లేదా? నోరులేక మాటలాడుటెట్లు? తలలేని నోరుకలదా. మక్కాయందలి చదురపు బండయేమిటిది? గడ్డములేని యాదాము చేసిన

పాపమునకుఁగాను గొడుకును భూలోకమునకుఁ బొమ్మనిగడ్డము గల దేవుఁడు గుఱుకొట్టుచున్నట్టు తలఁపని క్రైస్తవుఁడు లేఁడు గదా? ఆకారము లేని దేవుఁడు 'డే ఆఫ్ జడ్జిమెంటు' తీర్పుచెప్పుదినమందు సింహాసనమందెట్లు కూర్చుండును?

నిరాకారుఁడైన భగవంతునకు భక్తు లాకారకల్పనము చేయుట దోషమంచని తలఁచువారు భగవంతుఁడు సర్వదా నిరాకారుఁడనియే తలంతురేని యంతకుమించిన యజ్ఞానము లేదు. భగవంతుఁడు తన యిచ్ఛకొలఁది సాకారుఁడు నగుచుండును. నిరాకారుఁ డగుచుండును. భగవంతుఁడు సాకారుఁడే యనికాని నిరాకారుఁడేయనికాని చెప్పుట తప్పు. భగవంతుఁ డాకారము వహింపలేఁడనువా రాయన సర్వశక్తిమత్త్వమును నిరాకరించినవా రగుదురు. సర్వవ్యాపియైన భగవంతుఁ డర్చారూపంబుల లేఁడనువా రాయన సర్వవ్యాపకత్వమును దిరస్కరించినవా రగుదురు. నిరాఖ్యాతుఁడైన భగవంతునిఁ బేరఁ బిలువరాదనువారు శబ్దబ్రహ్మమును నిరాదరించినవా రగుదురు. భగవంతుఁడు గుణహీనుఁడనువా రాయన దయాహీనుఁడు. జ్ఞానశూన్యుఁడు. ఆనందశూన్యుఁడు నందురు. సచ్చిదానందస్వరూపుఁడుగదా భగవంతుఁడంటిమేని అసత్తుగానిది సత్తు. అంతియేకాని 'సత్తు' అని ప్రత్యేకముగా లేదని, శోకముకానిది యానందము. అంతియేకాని ప్రత్యేకముగా నానందమనునది లేదనియు, అచిత్తుగానిది చిత్తు. అంతియేకాని ప్రత్యేకచిత్తు లేదనియు నందురు. ఇట్టిదేవుఁ డెట్టిదేవుఁడో యిట్టివానిని

గొలిచిన ఫలమేమియుండునో యిట్టివానితోడి సాయుజ్యమున రాఁగల మేలేమో బుద్ధిమంతు లాలోచింతురుగాక. ఇట్టివాఁ డొకఁ డుండెనేని యట్టి దేవునితో భక్తులకుఁ బని లేదు. భగవంతునకు సాకార నిరాకారభేదకల్పనము శ్రుతివిరుద్ధము కావున నిరాకారునకు సాకారకల్పన మనుట బాలభాషణము. మేలుకొలుపునం దీ విషయము విశదముగ వ్రాయఁబడినది.

## దేవాలయ నిర్మాణోద్దేశము.

ఏ యుద్దేశముతోఁ దొలుత దేవాలయములు నిర్మింపఁబడినవో నే నెఱుంగఁజాలనుగాని నాకుఁ దోఁచిన కారణములు తెలిపెదను. భగవంతుఁడు సర్వవ్యాపియని యన్నిమతముల వారు నంగీకరించియున్నారు. భగవంతుఁడు సర్వవ్యాపి యైనపుడు భగవచ్ఛక్తియు సర్వవ్యాపినియే కదా. ఈ శక్తియే ప్రాణశక్తిగను వైద్యుతముగను, నయస్కాంతీయముగను, నాకర్షణశక్తిగను మఱియు నిప్పటికిఁ దెలిసినట్టియు నిప్పటికిని దెలియనట్టియు నానాశక్తులుగాఁ జెప్పఁబడును. "పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబల క్రియాచ" యని కలదుకదా. కావున బ్రహ్మమొదలు స్తంబపర్యంతము గల వస్తువులందన్నిట నేదో యొకశక్తిగలదు. పదార్థముల దశాభేదముచేత నీ శక్తుల వృద్ధియగుటయు క్షీణించుటయుఁ గలదు. ఈ వృద్ధిక్షయములన్య వస్తు సంయోగముచేతను గలుగును. రెండువస్తువు లొకటిగఁ జేరినపుడు రెంటియందును బూర్వము లేని యొక వింతశక్తి యుదయించుటయుఁ గలదు. ఎట్లన:—

ఒక మ్రాను మొద్దుగనున్నప్పుడు దానివంకఁ జూచువా రుండరు. దానినే యందమైన యాఁడుబొమ్మగాఁ దీర్చినయెడల నదియే చూచువారల మనస్సు నాకర్షింపఁగలదై యాహ్లాదకరమైయుండును. మునుపులేని యీ శక్తి యిప్పుడు క్రొత్తగా వచ్చినదా? లేదు. దశాభేదముచే మఱుఁగుపడియుండిన శక్తి యిప్పుడు బయటఁ బడినది. ఈ స్త్రీవిగ్రహ మచేతన మయ్యును జూచువారల కానందము కలిగింపను గాముకులమనస్సు కలవరపెట్టను జాలినదయ్యెఁగదా. ఈ బొమ్మకుఁ జీరకట్టి సొమ్ములు పెట్టి యలంకరించినచో నీ శక్తులు వృద్ధియగు. దీనికి మసిపాఁతగట్టి పేడఁబూసిన నీ శక్తి క్షీణించు. మంచుగడ్డతో నుప్పుగలిపినఁ జలిమిరి యెక్కువగును. నీళ్లలో సురాకారము వైచినఁ జలిమిరి హెచ్చును. పాలుచేఁపలు నేకభుక్తిని దినిన విషమగును. నెయ్యి తేనె సమభాగములు గలిపితినిన విషమించు. గంధకము సురాకారము బొగ్గు గలసినఁ దుపాకిమందగును. నాలుక కొనయందుఁ బైభాగమునఁ దుత్తునాగము క్రిందిభాగమున వెండి నాణెముంచి యీ రెండులోహముల కొనలు కలియునట్లు పట్టుకొనిన వైద్యుతశక్తి యుదయించి జిలజిలమని నాలుకయందుఁ దెలియును. లోకములోని ప్రతివస్తువునందును నాకర్షణ శక్తి తేజముగలవు. ఈ కారణముచేఁ బ్రతిపదార్థ మొకదాని నొకటి నాకర్షించుచుండును. సూర్యుఁడు భూమిని నాకర్షించిన భూమి సూర్యుని నాకర్షించును. తమ తేజముచేతనే దుష్టగ్రహములు దుష్టఫలములను మంచిగ్రహములు మంచిఫలములను

నిచ్చుచున్నవి. సువాసనగల పదార్థము లారోగ్యమును గలిగించుటకు దుర్వాసనగల పదార్థము లారోగ్యమును దొలఁగించుటకు నిదే కారణము. ఈ కారణముచేతనే దురాచారులు దుశ్శీలురు నపవిత్రులు నగువారిని సమీపించినను గీడుగలుగును. ఈ కారణముచేతనే యశుచులు ముట్టుతలు చండాలురు లోనగువారిని దాఁకరాకుండుట. ముట్టుతలు తోఁటలోనికి వచ్చినఁ గొన్నివృక్షములు చచ్చునని మాలాకారు లెఱుంగుదురు. «అస్పృశ్యత» పఠింపుఁడు.

ఇవి మనస్సున నుంచుకొని దేవాలయముల విషయమాలోచింతము. సామాన్యసుందర విగ్రహములందును నీశ్వర తేజము, నాకర్షణశక్తియు స్వభావముగనే కలవు. ఇఁక దేవాలయమందుఁ బ్రతిష్ఠించుటకై చేయు విగ్రహములను గొనరాదు. అమ్మనురాదు. కావునఁ బ్రత్యేకశిల్పిచేఁ జేయింపవలయు. ఆ శిల్పియుఁ జక్కని శాస్త్రజ్ఞానము గలవాఁడుగను సదాచారసంపన్నుఁడుగ నుండవలయు. అతఁడు దానిని జేయుకాలమందు స్నాతుఁడై శుచియై భక్తియుక్తుఁడై నియమవ్రతుఁడైయుండును భోజనపూర్వమే రహస్యస్థలములోఁ దదేకనిష్ఠుఁడైయుండి చేయును. ఆశిల్పి భగవన్మూర్తి యీ విగ్రహించుచున్నాఁడను తలంపుతోఁ జేయునుగాని రాతిబొమ్మనో కొయ్యబొమ్మనో చేయుచున్నానను తలంపుతోఁ జేయఁడు; ఇట్లు జీవకళ యుట్టిపడనట్లు శాస్త్రప్రకారము శ్రద్ధాభక్తులతోఁ జేయఁబడిన దానియందెట్టి తేజస్సుండునో చూడుఁడు.

ఆ తేజస్సు యంత్రబలముచేతను మంత్రబలముచేతను నభివృద్ధియగును. ప్రాణప్రతిష్ఠచేసి యాయా మంత్రముల నాయా దేవత నందు నా వాహానము చేసినయెడల నందలిశక్తి మఱింత యభివృద్ధియగును. శాస్త్రప్రకారము చేయఁబడు ధూపదీపార్చనాదుల నీ తేజస్సు సురక్షితమై భక్తులవాంఛలు దీర్పను సమర్థమై యుండును. ఇవి మనుష్యప్రతిష్ఠిత విగ్రహాముల విషయము. స్వయంవ్యక్త మూర్తుల తేజ మెట్టిదైయుండవల యునో చదువరు లూహింపవచ్చును. ఈ తేజస్సర్చకుల దురాచార దుశ్శీలములచేతను విహిత పూజాలోపముచేతను, నపస్వర మంత్రోచ్చారణముచేతను దర్శనార్థమై వచ్చినవారి యనాచారములు దురభిప్రాయములు దుశ్చేష్టలులోనగు వానిచేతను క్షయించుచుండును. అన్నియుఁ జక్కఁగ నుండినచో సదాచార సంపన్నులై సద్భక్తియుక్తులై యేకాభిప్రాయముతో శుచులై దర్శకులువచ్చినచోనట్టి దేవాలయంబుల మహిమ నెవ్వఁడుకొనియాడఁగలఁడు. విగ్రహాములయందలి తేజస్సు భక్తులపైఁబ్రసరించుటచేతనే దయ్యములాడుట రోగములు నివారణమగుట కలుగుచున్నవి. ఈ తేజస్సు దేహామునకు సోఁకుట కడ్డముగనుండరాదనియె దేవునిసన్నిధియందు నూర్ధ్వకాయమును వస్త్రముచేఁ గప్పరాదని శాస్త్రమేర్పడినది. దేవతాసన్నిధానమందు భక్తుల భక్తి ఘంగిపారలి భగవన్మూర్తియందుఁ బ్రవేశించి తత్తేజమును వృద్ధిచేయును. ఆ తేజము భక్తులయందుఁ బ్రసరించి వారిని బావనులఁ జేయును. ప్రియపుత్త్రుఁడు తండ్రియొద్దకుఁ బోయి

నపుడు వారియిరువుర మనోవికారము లెట్టివైయుండునో యూహింపుఁడు. ఇంతేగాక వేదాధ్యయన మందిరములు దేవాలయములే. భక్తులభజనమందిరములు దేవాలయములే. జపస్వాధ్యాయానుష్ఠానశీలురకుఁ దావులు దేవాలయములే. బీదలకు-సాధులకు-దేశాంతరాగతులకు, నతిథులకభ్యాగతులకు నన్నదానశాలలు దేవాలయములే. భక్తిపోషణములు నారోగ్యవర్ధనములు దేవాలయములే. ఈ కారణములచే సత్తేజము దేవాలయముల నిండియుండును. దేవాలయమే దేహము. గర్భగృహమే హృదయము. ప్రతిష్ఠితమూర్తియే హృదయాంతర్వర్తి యీశ్వరుఁడు. అఖండదీపమే యాత్మతేజస్సు. కావుననే యఖండదీపమాఁటుట జీవుఁడు దేహమును విడిచిపోవుటవంటిది. ఇట్లే తక్కినవి యూహించుకొనవలయును. "సర్వమున్నతని దివ్యకళామయమంచు విష్ణునందుల్లముఁ జేర్పవలయునని" యుండఁగా నిట్టి మూర్తులందు దారులోహ పాషాణబుద్ధి సేయువానికంటె మూఢుఁడెవ్వఁడు? పాపియెవ్వఁడు? ఇట్టివాఁడు తనతండ్రిదో భార్యదో బిడ్డదో ఛాయాపటమునుజూచినపుడిది యొక కాగిదపుఁ దునుక దీనిపైనిది బొమ్మ ముద్రింపఁబడినదని తలఁచునా? ఎవరైన నడిగినపు డీయన నా తండ్రి ఇది నా భార్య ఇది నా బిడ్డయనిచెప్పుట లేదా? వీని పటము నెవ్వఁడైనఁ గ్రిందవైచి కాలితోఁ దన్నినఁ దన్నుఁ దన్నినట్లు తలఁపఁడా? ఈ కృష్ణుని జూడుము గోపికల చీరలెత్తుకొనిపోయి యెట్లు చెట్టెక్కినాఁడో పాలకై యశోద కొంగును నెట్లు లాగుచున్నాఁడో యని పటమునఁ జూచి యను

కొనుట లేదా? అట్టులే భగవద్విగ్రహములను జూచినపుడు భగ వన్మూర్తియుఁ దత్తేజము తల్లీలలు స్మరణమునకు వచ్చునే కాని యిది పాషాణమా లోహమా యను విచికిత్స యెవ్వనికిఁ బొడ మును? ఈ మూర్తులు భగవదాకారములని పూజింపఁబడుచు న్నవి కాని శిలలు దారువులని పూజింపఁబడుట లేదు. కృష్ణావ తారతత్త్వముఁ జూడుఁడు, దేవతీర్థమంత్రౌ షధాదులయెం దెవ్వని కెట్టి భావనయో యట్టి ఫలమే కలుగును. రాయి కొయ్యయనుకొనువారి కవియే లభించు. దైవభావన చేయువారికి దైవమయియే ఫలమిచ్చును. అద్దమునందుఁ బ్రతిఫలించిన కొం డనుజూచి యేమనుకొందుము. అంత గొప్పకొండను జిన్న యద్దములోఁ బోసినారని తలఁతుమా? కాదు. గొప్పదాని ప్రతిబింబమే యీ యల్పమని తలంతుము. ఛాయాబింబ ములు నిర్జీవములు. దేవాలయవిగ్రహములు సజీవములు. భేద మింతయే కావున విగ్రహారాధకులు దారుశిలాలోహములఁ బూజింతురనుట యజ్ఞానవిజృంభణమున నైన జల్పము. దేవా లయములోని విగ్రహములు కదలినవని నడచినవని మాట లాడినవని పురాణములం దుండుటయే కాక నేఁటి యనుభవ మందును గలవు.

కం. కదలెడి వేల్పుల రూపులు
వదలెడిఁ గన్నీరు వానివలనం జెనుటల్
పొదలెడిఁ బ్రతిమలు వెలిఁజని
మెదలెడి నొక్కొక్కగుడిని మేదినియందుఁ భాగవతము

జాంబవతీకల్యాణము, కాళికి నరబలియిచ్చిన రాజుకథ లోనైనవియు బీబీనాంచారు మేలుకోట సంపత్కుమారస్వామి కంచి వరదరాజులు వేంకటేశ్వరులు భద్రాచలరాముఁడు ఒంటిమిట్ట కోదండరాముఁడు లోనగు దేవతలు భక్తుల ననుగ్రహించినవిధము స్మరింపుఁడు.

దేవాలయములు వేదములఁ జెప్పఁబడినట్లు కొందఱు వ్రాసియున్నారు. శ్రీమద్రామాయణమునఁ బెక్కుచోట్ల గలవు. భారతభాగవతములందును గలవు. భారతము. శాంతి పర్వము. ఆపద్ధర్మప్రశ్నపర్వము విశ్వామిత్ర చండాల సంవాదము 141-వ అధ్యాయము ఆరణ్యపర్వమునఁ గలియుగ ధర్మవర్ణనము చూడుఁడు. అనాదిగ దేవాలయముల నేర్పఱిచిన మహాత్ములును విగ్రహారాధనముచేసి ధన్యులైన మహర్షులును శంకరరామానుజ మధ్వాచార్యాదులును రామకృష్ణ పరమహంస చైతన్యాదులు లోనగు ననేక భక్తులును మందమతులైరేని వారిపాత్తే మాబోఁటి యజ్ఞులకు శ్రేయస్కరముగాని యీ ప్రాజ్ఞుల పొత్తుగాదు.

కలికాలమహిమచే భక్తి నశింపఁగాఁ గొందఱు బ్రహ్మనిష్ఠులమని వ్యర్థులగుచున్నారు. కొందఱు శిశ్నోదర పరాయణులై బ్రహ్మనామోచ్చారణముమాత్రము వృత్తిగా నుంచుకొని జీవించుచున్నారు. కొందఱు తాము చెడుటయేకాక యితరులఁ జెఱుచుచున్నారు. శ్రీమదొంటిమిట్ట కోదండరామ కైంకర్యమునకై సంచారముచేయు సమయంబునఁ బెక్కు గ్రా

మంబులఁ బెక్కుర నిట్టివారిని గంటిని. జ్ఞాననిష్ఠ యెట్టిదో యెఱుఁగని యీ విపరీతజ్ఞానులు భక్తిమార్గమును నిరసించుటయు వింటిని. కొన్ని గ్రామంబులఁ గొందఱు నన్నాక్షేపించుట యుఁ దటస్థించెను. వీరి ప్రశ్నలవలన వీరి ప్రశ్నలకుఁ జర్యలకుఁ గారణము భక్తివిషయమైన యజ్ఞానమే యని తెలిసి దేవా లయ విషయము భక్తివిషయ ముపన్యసించితిని. అయినను దేవాలయవిషయము విగ్రహారాధనము విషయము గ్రంథ రూపమున నుండినఁ గొందఱు గాకున్నఁ గొందఱైన బాగు పడుదురని తోఁచి యీ గ్రంథమును బ్రకటించితిని. గ్రంథము లోపల నుండవలసినభాగము పొరపాటున ముద్రణమునందుఁ దప్పుటచే నిందు ముద్రించితిని.

“తస్మాత్సర్వేషామధికారిణా మనధికారిణాం భక్తియోగ ఏవప్రశస్యతే। భక్తియోగో నిరుపద్రవః, భక్తియోగాన్ముక్తిః। బుద్ధిమతా మనాయాసేనాచిరాదేవ తత్త్వజ్ఞానం భవతి, తత్కథ మితి। భక్తవత్సలస్స్వయమేవ సర్వేభ్యో మోక్ష విఘ్నేభ్యో భక్తినిష్ఠాన్ సర్వాన్ పరిపాలయతి। సర్వాభీష్టాన్ ప్రయచ్ఛతి, మోక్షం దాపయతి, చతుర్ముఖాదీనాం సర్వేషామపి వినావిష్ణు భక్త్యాకల్పకోటిభి ర్మోక్షో నవిద్యతే। కారణేన వినాకార్యం నోదేతి। భక్త్యావినా బ్రహ్మజ్ఞానం కదాపినజాయతే। తస్మా త్త్వమపి సర్వోపాయాన్ పరిత్యజ్య భక్తిమాశ్రయ। భక్తినిష్ఠోభవ భక్తినిష్ఠోభవ భక్త్యాసర్వసిద్ధయస్సిధ్యంతి। భక్తేరసాధ్యం నకించి దస్తి॥” మహానారాయణోపనిషత్తు.

దీనియర్థమేమన "కావున నిరాలంబ సాలంబ సమాధులను నితరోపాయములకు నధికారులైనవారికిని, గానివారికిని, భక్తియోగమే ప్రశస్తమైనది-భక్తియోగము నిరపాయము-భక్తియోగమువలన ముక్తి లభించును. బుద్ధిమంతులకు నాయాసము లేక శీఘ్రకాలమునందే తత్త్వజ్ఞానము కలుగును.

అది యెట్టులంటివా? భక్తవత్సలుఁడు తానే భక్తినిష్ఠులను సమస్తవిధములైన మోక్షవిఘ్నములవలన సంరక్షించును. అన్నికోరికలనొసఁగును. మోక్షమొసఁగును. బ్రహ్మా మొదలైనవారికందఱకు విష్ణుభక్తి లేక కోటికల్పములకైన ముక్తిలభింపదు. కారణము లేక కార్యము పుట్టదు. భక్తిలేక బ్రహ్మజ్ఞానమేనాఁటికి నుదయింపదు. కావున నీవును దక్కినయన్ని యుపాయములను వదలి భక్తియోగము నాశ్రయింపుము భక్తినిష్ఠుఁడవుకమ్ము. భక్తినిష్ఠుఁడవుకమ్ము. భక్తిచేత సర్వసిద్ధులు కలుగును. భక్తికసాధ్యమైనది కొంచెమైన నేదియు లేదు." అని యుపనిషత్తు చెప్పుచుండఁగా దీనికి విరుద్ధముగఁ జెప్పువారి మతిహీనతకు నేమని పగితును.

బాగుపడు తలవ్రాఁత గలవారికి మహానారాయణోపనిషత్తునందలి యీ గుహ్యోపదేశము రుచించును.

ఎంతకు గాలికి వడఁబడి డస్సినవాఁడు చెట్లనీడఁ జేరుపట్లు కర్మ, జ్ఞాన, లయ-హఠాదియోగంబుల వేలకొలఁది జన్మంబులఁ బరితపించినవాఁడే కడపట భక్తియోగము నాశ్రయించి సుఖపడును. అంతసఱకది లభింపదు. స్వారాజ్యముగాని స్వారాజ్యము

గాని మోక్షసామ్రాజ్యముగాని రామభక్తివలన లభించును. వాల్మీకిరామాయణము ప్రమాణము.

శ్లో॥ శక్యం ఖలు భవేద్రామ! సహాయేన త్వయానఘ।
సురరాజ్యమపి ప్రాప్తుం, స్వరాజ్యం కిం పునః ప్రభో॥

కిష్కింద. ౮ స.

ఒంటిమిట్ట
వాల్మీకాశ్రమము,
౧-౯-౧౯౨౭.

ఇట్లు విన్నవించు,
భక్తచరణపరిచరణుఁడు,
వాసుదాసుఁడు.

శ్రీరామార్పణమస్తు.

7-3-63

[illegible]

శ్రీరామాయనమః.

# దేవాలయతత్త్వము.

శ్లో॥ విశ్వం యస్స్వకృతం విభజ్యసతతం, జీవైరసంఖ్యైర్యుతమ్.
తస్మిన్సాధు జనావనాయ చముహుర్ధత్తేవతారాన్ బహూన్
యత్పాదాంబుజభక్త ఏవలభతే, ముక్తిం దురాపాంపరైః
తం సర్వజ్ఞ మహం నమామికరుణం, నారాయణం సద్గుణ
మ్॥. శ్రీశుకః,

శ్లో. శ్రీరంగస్థల వేంకటాద్రి కరిగిర్యాదావశతాష్టోత్తరే
స్థానే గ్రామనికేతనే షుచసదా సాన్నిధ్య మాసేదుషే
అర్చారూపిణ మర్చకాభి మతితః స్వీకుర్వతే విగ్రహం
పూజాం చాఖిల వాంఛితాన్వితనుతే శ్రీశాయతస్మైనమః.

సూర్యా చంద్రముల గ్రహణవేధయు, నలచక్రవర్తివై
రూప్యము, హరిశ్చంద్రుని స్మశానవాసము, శ్రీరాముల యరణ్య
రోదన విధురత్వములు, పాండవుల ప్రచ్ఛన్న స్థితియు, నర్జును
బృహన్నలాత్వము, నింద్రుని నిలీనత్వము మహాపురుషుల కష్ట
ములు బలిచక్రవర్తి రాసభ రూపధారణము, నయోధ్యా హస్తి
నాపుర పాటలీ పుత్రాదుల దుర్దశలు నాలోచించిన దురతి
క్రమంబయిన కాలంబు బలంబునం జేతనాచేతనంబులకును
బహ్యాయంబున నీచోచ్చస్థితులు ప్రాప్తించుచుండునని తోఁ

పకమానదు. అందు ముఖ్యముగ హానివృద్ధులు చంద్రునకు కాని నక్షత్రములకు లేనట్లు విశేషోన్నత పదవి యందుండు వానికే విశేష నిమ్నదశయుఁబట్టును. చెట్టెక్కిన వానికిఁ బతన భయముగలదుగాని నేలఁబరుండిన వానికి నేమికలదు? ఈ న్యాయము ననుసరించియే పూర్వ మేకశిలానగరంబని సార్థక నామధేయము వహించిన యొంటిమిట్ట నేఁడు కుగ్రామమై కానవచ్చుచున్నది.

పైనుండి క్రిందఁబడిన మంటిముద్ద వికలమై పోవునుగాని లీవకలిగిన కందుకము మరలఁ బైకెగయును. సత్త్వవంతున కాపదవచ్చిన నల్పకాలముండునుగాని శాశ్వతముగ నెలకొనదు. "నాత్మాన మవసాదయేత్" అనునట్లు లాంఛను బీడింపక 'ఆత్మనావిందతే వీర్య' మనుట స్మరించి, యది తేజోవంతమై ప్రకాశించుచుండునట్లు చూచుచుండు వఱకు నాధివ్యాధులు లోనగు బాధలు లేక దేహము జవసత్త్వారోగ్యములుకలదై తేజోవంతమై యుండును. అట్లులే యేగ్రామంబున జనులు శ్రద్ధా భక్తియుక్తులై భగవత్పూజాసక్తులై సాధుపోషకులై దానధర్మాసక్తచిత్తులై యుందురో యాగ్రామము దుర్భిక్ష మారీత్యాది బాధలు లేక సుఖసంవాస యోగ్యమై యుండును. దేహమునకు నాత్మాలయమైన హృదయ మెట్టిదో గేహమునకుఁ బూజామందిరము, గ్రామమునకు దేవాలయము నట్టిది. జీవము లేని దేహము, దేవపూజా మందిరము లేని గేహము, దేవాలయము లేని గ్రామము సమానములు. కావుననే దేవ

పూజలేని యింటను, దేవాలయములేని యూరను నొక్కనాఁ
డైన నుండరాదు. పక్వముగాని యపక్వముగాని యందు భుజిం
పను రాదని శాస్త్రములు శాసించుచున్నవి.

శ్లో. విష్ణ్వర్చారహితే గ్రామే, విష్ణ్వర్చారహితే గృహే
న కుర్యాదన్నపానాది, న తత్ర దివసం వసేత్. భార.సంహిత
కేశవార్చా గృహే యస్య, న తిష్ఠతి మహీపతే!
తస్యాన్నం నైవ భోక్తవ్య, మభక్ష్యేణ సమం హి తత్.
అన్నం = పక్వమ పక్వంవా.

ఈ తత్త్వమెఱింగియే మనపెద్ద లొక్కొక్కపట్టణమందును, జనపదమందును, బల్లెయందును, బర్వత కాననములందును దేవాలయములఁ గట్టించి నిత్యపూజా దీపారాధన నైవేద్యాదులకుఁ దగిన యేర్పాటులు చేసిరి. మనలో ననేల? తురకలున్నచోట మసీదులు లేవా. క్రైస్తవు లున్నచోటఁ జర్చిలు *లేవా? అన్ని మతములవారికి నిట్టివి గలవు. విగ్రహారాధనము నిషేధించు బౌద్ధమతజులును బుద్ధున కాలయములు గట్టి తద్విగ్రహముల నారాధింతురుగదా? తురకలు మోహరమందు దేవపూజయైన మేలే, మనుజపూజ గావించెదరుగదా. వీరి కాబా యేమిటిది? క్రైస్తవుల క్రాసేమిటిది.

మక్కామదీనాలోని కొన్ని గోరీలను శత్రువులు ధ్వంసముచేసిరని యిచ్చటి తురకలు మొత్తుకొని యిప్పుడు మొఱలిడుచున్నారుగదా. పీనుఁగులను బూడ్చిన గోరీలను వారు

* దేవతావిషయ మెచ్చటఁ జర్చచేయఁబడునో యది చర్చి.

పరమపవిత్ర దివ్యస్థలములుగ భావించి బూజించుచుండ మనము భగవదాలయములఁ బూజించిన దోషమా?

Note the same word *tanu*, 'body' in VII. 21 as in IX. II. An *idol* may of course be hurely mental as in the case of 'form-eschewing' Mussalmans and Protcstants- None but the formless mind can consider anything without a *form*. Allah *speaks* with His Angels in the Holy Book. Who but a *man* can speak [unless it be Balaam's ass or......a *woman*—which God forbid) Is He bareheaded? Does he display a Kafir's shaven chin (Nay who should shave Him?) or an untrimmed moustache, that no clean food can pass? A red beard (has He not been to mecca?) with upper lip well-clipped; and a green turban there you are. And what of the *square stone* at mecca?

As for Christians, there is hardly one who can conceive the Father without a big beard and a forbidding scowl engaged in turning out his only Son (who has a shorter beard) to atone for the disobedience of Adam (who has no beard at all) Those who would scorn such heathenish imagery can console themselves with a gigantic clergyman in a white tie! Besides must He not *sit* upon the Judgment Seat? What of the......quarters (disah) moses *saw*?'' F. T. Brooks. The Gospel of Life.

శ్రీమదొంటిమిట్ట కోదండరామ కైంకర్యమునకై గ్రామసంచారము చేయునపుడు i. దేవుఁడు దేవాలయమందే కాని మఱి యెందును లేఁడాయనియు, ii. యోగులగు సుబ్బారావుగా

రిప్పటికిని దేవాలయములను విగ్రహములను గట్టుకొని దుఃఖిం చుట వింతగానున్నదనియు, iii. దేవాలయము పునరుద్ధారము చేయకుమని మఱియొకరును నుపదేశవాక్యములు వచింప వింటిని. కలికాలమహిమ యనుకొంటిని.

తే. బోద్ధలగువారు మత్సర పూర్ణమతులు
ప్రబలగర్వవిదూషితుల్ ప్రభువులరయ
నితరమనుజుల బోధోపహతులుగాన
భావమున జీర్ణమయ్యె సుభాషితంబు.

కం. తెలియనిమనుజుని సుఖముగఁ
దెలుపందగు; సుఖతరముగఁ దెలుపఁగవచ్చున్
దెలిసినవానిం; దెలిసియుఁ
దెలియనినరుఁ దెల్ప బ్రహ్మదేవునివశమే.

యను భర్తృహరివాక్యములు స్మరించి జ్ఞానలవదుర్వి దగ్ధులైన నవనాగరక మహాప్రాజ్ఞుల సంబోధించి బోధించి బాధింపనోల్లక వీరి వాక్యములు విశ్వసించి లోకులు చెడ కుండుటకై సంగ్రహముగ నీ విషయముగుఱించి వ్రాయ సాహ సించితి. నాయల్పజ్ఞతను విశేషజ్ఞులు క్షమింతురుగాక.

## దేవాలయ మన నేమి?

దేవాలయము, దేవాగారము, దేవతాయతనము. ఇవి పర్యాయపదములు దేవుని గృహమని యర్థము. సంగ్రహార్థము ఆయతనము ఆలయమని చెప్పుటయుఁగలదు. దేవాలయ మనఁగా (దేవ + ఆలయము) దేవుని నివాసస్థానము. సర్వవ్యాపి

నిత్యుఁడునగు దేవుఁడు సర్వకాల సర్వావస్థలయందును, సర్వత్ర కలఁడుగాని యొకవేళ నొకచోటనుండి వేఱొక వేళ వేఱొక చోట లేకుండుట లేదు.

క. ఇందుఁగలఁ డందు లేఁడని
సందేహమువలదు, చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే కలఁడు దానవాగ్రణివింటే. భాగ. ౭

యని భగవంతుని వెదకి చూచి సాక్షాత్కరింపఁ జేసి కొన్న ప్రహ్లాదుఁడు చెప్పెఁగదా. కావున దేవుఁడు సర్వత్ర గలఁడనుట యంగీకార్యమే. అయినను దేవుఁడు సర్వత్రకల డని మనుష్యదేహములను, గృహములను, ఖరవృషభ పశు పక్ష్యాదులను దేవాలయములను చున్నారమా? ఏల యనుట లేదు? నల్లయిల్లు (Blue house) తెల్లయిల్లు (White house) అన్నట్టులు శిలాలయములనక దేవాలయములన నేల? ప్రతి పదార్థమందును, బ్రతి దారువునందును, దూదకు మంచుగడ్డ యందును వేఁడిమికలదు గదా? అట్లుండ నగ్గిపెట్టె నిప్పుపెట్టె యగ్గిపుల్ల నిప్పుపుల్లయని యేల చెప్పుదుమో యాలోచించితి మేని దేవాలయ మనుటకుఁ గారణము స్పష్టమగును. మిద్దె మీఁద గాలియున్నది గాని క్రింద లేదందుము. నిజముగాఁ క్రింద గాలి లేదా?

శ్లో. యద్యద్విభూతిమత్సత్త్వం, శ్రీమదూర్జితమేవవా
తత్తదేవావగచ్ఛత్వం, మమతేజోంశసంభవమ్. భగ. ౧౦-౪౧

ద్వి. సువిభూతిగల దేది శోభితమేది
యవిత ధోర్జితమేది యావస్తుతతులు
నాదు తేజోంశంబునం గల్గెనంచు
నీదుమనంబున నెఱనమ్మవయ్య ద్వి. భగవద్గీత.

అనుట స్మరింపవలయును. దీనివలన నెచ్చోట భగవత్తేజస్సెక్కువగఁగాన వచ్చుచున్నదో నా ప్రదేశము దేవాలయమని యర్థమే కాని దేవుఁడు దేవాలయమందుఁ దప్పమఱియెందు లేఁడని యర్థముకాదు.

## వేదములు క్షుద్రదేవతారాధన పరములా.

వేదములందు నగ్నివరుణ వాయుదేవతల సంబోధించు మంత్రములుండుటఁగని యతత్త్వవిదులు నసంప్రదాయజ్ఞులు నగు పాశ్చాత్యులు పూర్వు లార్యులు ప్రాకృతిక పంచభూతములఁ బూజించుచుండిరని వ్రాసిన వెఱ్ఱివెక్కిరు వ్రాఁతల విశ్వసించి యనాస్త్రాతి స్వమత గ్రంథగంధులు వానినే యనువదించుచు దేవాలయములు నూతన కల్పితములనియు, భగవంతుఁ డొక్కఁడే యనుజ్ఞానమిటీవల నార్యులకు లభించెనని యుఁ దలఁచుచుందురు. ఈ యజ్ఞానమెంతయు శోచనీయము కేవల పంచభూతము లచేతనము లగుట పూజ్యములని వేదము లెన్నఁడు చెప్పవు. దేవుఁ డొక్కఁడనియే చెప్పును. ఆయన సర్వాంతర్యామియని చెప్పును. మనకుఁ గానవచ్చినను గానరాక యున్నను, సృష్టింపఁబడిన వన్నియు భగవన్మయములే యని చెప్పును. వాసుదేవ విష్ణునారాయణ శబ్దములే యీ

యర్థమును బోధించును. చేతనా చేతనములన్నియు భగవంతునికి దేహమునట్టివని చెప్పును. దేహము నట్టివనఁగా భగవంతుని ధారణ పోషణములకు లోపడినవని యర్థము. జీవుఁడెట్లు దేహమును ధరించి పోషించునో యట్లులే భగవంతుఁడు చేతనాచేతనముల నన్నిటిని ధరించును పోషించును. కావున విజ్ఞుఁడగువాఁడు దేనికి నమస్కరించినను నది భగవత్కళామయమని యెంచి యందు నంతర్గతమైయున్న భగవంతునకు నమస్కరింపవలయునని మన శ్రుతి స్మృతి పురాణాదులు ఘంటాఘోషముగఁ జాటించుచున్నవి. "ప్రణమే దీశ్వరకలా మాశ్వచండాలగోఖరమ్." భాగ. ౧౧ స్కం. "సర్వము న్నతని దివ్యకలామయ మంచు విష్ణునం దుల్లముఁజేర్చి." అని శ్రీభాగవతము చాటించెడినిగదా. దేవతలందఱు నాయనకు నంగములవంటివారు. "స ఆత్మా-అంగాన్యన్యా దేవతాః" యస్య పృథివీ శరీరమ్మని శ్రుతివచనములు. కావున నగ్నివాయు వరుణుల సంబోధింపఁ బడినపుడా యా కార్యములు చేయుటకై యా యా యాకారములందా వహించిన యంతర్యామి భగవంతుఁడు సంబోధింపఁబడినట్లు తలంపవలయును గాని వారి దేహములు సంబోధింపఁబడినవని తలఁచుట పొరపాటు. సర్వ దేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతియని ప్రమాణము వేదములందలి మిత్ర-వరుణాది శబ్దములఁగాంచి కొందఱు తత్తన్నామక క్షుద్ర దేవతలని భ్రమింతురు. ఈ పేర్లన్నియు భగవత్పర్యాయములే. ఇతరులయం దివి గౌణములు, ఔపచారికములు. ధని

కునిఁజూచి "వానికేమి మహారా" జన్నట్లు త్రైవిద్యులు కాము
కులా యీ దేవతలనట్లట్లే పూజింతురు.

శ్లో. సర్వోపనిషదో గావో, దోగ్ధాగోపాలనందనః
పార్థోవత్సస్సు ధీర్భోక్తాః, దుగ్ధంగీతామృతంమహా
త్తన్నట్లు భగవద్గీత సర్వోప నిషత్సారమేకదా.
అది యేమిచెప్పుచున్నది?

శ్లో. భూమిరాపోనలో వాయుః, ఖం మనోబుద్ధిరేవచ
అహంకార ఇతీయంమే,భిన్నాప్రకృతిరష్టధా॥ భగ. ౭-౪
అపరేయమితస్త్వన్యాం, ప్రకృతిం విద్ధిమేపరామ్
జీవభూతాం మహాబాహో,యయేదం ధార్యతేజగత్. ౫
ఏతద్యోనీని భూతాని, సర్వాణీత్యుపధారయ
అహం కృత్స్నస్యజగతః, ప్రభవః ప్రలయస్తథా. ౬
మత్తః పరతరంనాన్య, త్కించిదస్తి ధనంజయ
మయి సర్వమిదంప్రోతం, సూత్రే మణిగణాఇవ. ౭

ద్వి. కవ్వడీ! భూమ్యుదకము లగ్నివాయువులు నభంబు మనంబు
బుద్ధ్యహంకార, ములును నాఁగవిభక్తములు నాదుప్రకృతి
యెనిమిది విధముల; నిది నికృష్టంబు, కనుగొనఁగా నింత
కంటెను వేఱు ప్రకృతిని జీవరూపంబగుదాని, సకలమైనట్టి
యీ జగమునకెల్ల నాధారమును బరంబగుదాని నెఱుఁగు,
సూధీర! యీరెంట నొదవు భూతములు ప్రభవంబునకు
జగత్ప్రలయంబునకును, శుభచరిత్రా! నేనెనుమ్ము కాన

ణము. నాకంటె శ్రేష్ఠ మన్యంబేదిలేదు. లోకమంతయును నాలోన దారమున రతనంబులట్లు గూర్పంబడియుండు.

ద్వీపన భగవద్గీత.

ఈ విధముగ సర్వము భగవదాత్మకము గావున దేనిని బూజించినను భగవంతుని బూజించుచున్నాననుజ్ఞానము లేక యింద్రుని నింద్రునిగా సూర్యుని సూర్యునిగాఁ బూజించి రేని దీనివలన ఫల మల్పము నశాశ్వతము.

శ్లో. యోయో యాం యాం తనుం భక్తః
శ్రద్ధ యార్చితు మిచ్ఛతి, తస్య తస్యాచలాం శ్రద్ధాం,
తామేవ విదధా మ్యహమ్. 7-21
సతయా శ్రద్ధ యాయుక్త, స్తస్యారాధన మీహతే
లభతే చతతః కామాన్, మయైవ విహితాన్హితాన్ 7-22
అంతవత్తు ఫలం తేషాం, తద్భవత్యల్ప మేధసాం
దేవాన్ దేవయజో యాంతి, మద్భక్తా యాంతి మామపి.
భగ 7-23
యేప్యన్య దేవతా భక్తా, యజంతే శ్రద్ధ యాన్వితాః
తేపి మామేవ కౌంతేయ, యజంత్య విధిపూర్వకమ్. 9-23
అహంహి సర్వయజ్ఞానాం, భోక్తాచ ప్రభురేవచ,
నతుమా మభిజానంతి, తత్త్వేనాతశ్చ్యవంతి తే. 9-24
యాంతి దేవవ్రతా దేవాన్, పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా, యాంతి మద్యాజినోపిమామ్.

ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం, నాన్యచ్ఛ్రేయో వేద యంతే ప్రమూఢాః
నాకస్య పృష్ఠే తే సుకృతేను భూత్వేమం లోకం హీనతరం వావిశంతి॥ ముండక.

త్రైవిద్యామాం సోమపాః పూతపాపా।
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తేపుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవ భోగాన్. ౯-౨౦
తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం, క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి,
ఏవం త్రయీ ధర్మమను ప్రపన్నా, గతాగతం కామకా మాలభంతే. భగ. ౯-౨౧.

ద్వి. మాన్యచరిత్ర యే మానవుఁడేని। యేయే శరీరంబు నెనఁగాఁచి భక్తిఁ, బాయక శ్రద్ధతో భజియింపఁగోరు। నట్టట్టి వానికి నట్టట్టి శ్రద్ధ, దిట్టంబు గావింతు దృఢముగా నేను। శ్రద్ధచే వాఁడు నారాధించెనేని, సిద్ధింపఁగానేన చేయుదు హితము। లైన యాతనికోర్కు లగ్గునా వింటె. జ్ఞానహీనుల కిట్లు సమకూరు ఫలము। లంత మొందును; దేవతాళిని సవన, తంత్రముల్ సలుపుచుఁ దనివెడివారు। ప్రాపింపఁ గలుగుదురా దేవతలనె, ప్రాపించెదగు నాదు భక్తులు నన్నె। ఇతర దేవతలను, నెవ్వరు భక్తి రతులయి యజి

యింత్రు శ్రద్ధతో వార లవిధిపూర్వకముగ యజియింత్రు,
నన్నె, పవనసుత ధ్వజా భావింపు దీని। అన్ని యజ్ఞములకు
నధిపతి భోక్త, నన్నుఁగా నెఱుఁగుము; నన్నుఁ దత్త్వమున।
వార లెఱుంగమి భ్రష్టు లయ్యెదరు; వారక దేవతావ్రతు
లును దేవ। తలను బొందుదురు; పితరుల యజింపఁ గల
యుదుర్ పితరులఁ; గల భూతములకు। యాగకోటులను
జేయంగ భూతముల, బాగుగఁ బొందినవార లవుదురు।
నన్ను లోఁగూర్చి జన్నంబును జేయ, నన్నె పొందుదురయ్యా
నాకేంద్ర తనయ। త్రైవిద్యనేర్చి యధ్వరము లొనర్చి,
పావనులై సోమపానంబుచేసి। సవనములచే నన్నుఁ జాలఁ
బూజించి, దివిజలోకముఁగోరి తెలుఁతురు నన్ను। వారలు
పుణ్యమౌ స్వర్గంబుఁ జేరి, తీరఁగ దివ్యముల్ దేవభోగముల।
ననుభవింపుదు; రట ననుభవాంతమున, ఘన సుకృతంబులు
క్షయ మౌట కతన। మనుజలోకంబుల మఱి జనియింత్రు;
మనమునఁగోరి కామంబుల నిట్లు। దవిలి చేయుచుఁ ద్రయీ
ధర్మపద్ధతులు, భువి రాకపోకలు పొందుచుండెదరు॥

దీనివలననే దేవతనైనను, నేమూర్తినైనను రెండువిధ ములఁ బూజింపవచ్చునని యేర్పడుచున్నది. కానవచ్చు స్వరూపముగ నొకవిధము. భగవన్మూర్తిగ నొకవిధము రజోగుణతమో గుణములకు వశపడి కామక్రోధాదులకు దాసులైనవారు వారి వారి కోరికల నెఱవేర్చుకొనుటకై ఈ శీఘ్రఫల ప్రదాతలగు నింద్రాదుల నింద్రాదులుగానే యర్చింతురు వీరికి జనన మరణ

ములు తప్పవు. సాత్త్వికు లింద్రాదులు వాసుదేవాత్మకులు గావున భగవంతుని బూజించుచున్నామను నధ్యవసాయముతో నాయా దేవతలఁ బూజింతురు. గుణభేదమున నధ్యవసాయ భేదము. ఆర్తుఁడు - జిజ్ఞాసువు - అర్థార్థి జ్ఞానియను నలువురు తన్ను భజింతురనియు నందు జ్ఞాని శ్రేష్ఠుఁడనియు భగవంతుఁడే చెప్పెను గదా. మఱియును,

"ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కింకరిష్యతి
సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి."

భగవ. 3-33.

స్వధర్మాచరణమే ముక్తిసాధనము.

అన్నిభూతములు ప్రకృతికి లోఁబడివర్తించునవే. దానిని మీఱునది యేదియు లేదు. కావున నొకవిధమైన ప్రకృతి గుణము కలవాఁడు మఱియొక ప్రకృతిగుణము కలవానివలె వర్తించుట యసాధ్యము. అనియు గుణకర్మముల కొలఁది నాలుగు వర్ణములను సృష్టించితిననియు, వారి వారి స్వభావ కర్మములను జెప్పి యీనాలుగు వర్ణములవారు తరించు నుపాయము వారి వారివర్ణాశ్రమాచారములందు వర్తించుచు భగవదుపాస్తి చేయుటయే యనియుఁ గృష్ణుఁడు బోధించెను. మఱియ

శ్లో. స్వే స్వేకర్మణ్యభిరతః, సంసిద్ధింలభతేనరః
స్వకర్మనిరతః సిద్ధిం, యథావిందతి తచ్ఛృణు. ౧౮-౪౫.
యతః ప్రవృత్తి ర్భూతానాం, యేనసర్వమిదంతతమ్
స్వకర్మణా తమభ్యర్చ్య, సిద్ధింవిందంతి మానవాః. ౧౮-౪౬.

శ్రేయాన్ స్వధర్మోవిగుణః, పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావనియతంకర్మ, కుర్వన్నాప్నోతికిల్బిషమ్. ౧౮-౪౭.
సహజం కర్మకౌంతేయ, సదోషమపి నత్యజేత్
సర్వారంభాహిదోషేణ, ధూమేనాగ్నిరివావృతాః ౧౮-౪౮

ద్వి. నరపాళి తనుతను నైజ కర్మముల, నొనరించియాసక్తినొందు సం
సిద్ధి। తనకర్మనిరతిసిద్ధాను సంసిద్ధిఁ, గనియెడివిధము వక్కా
ణింతు విధము। ఎవ్వఁడు భూతాళినెల్ల సృజించు, నెవ్వాని
చేనిది యెల్లనునిండు। వానిని మనుజులు స్వస్వకర్మములఁ,
మానుగఁ బూజించి మఱిసిద్ధిఁగందు్రు। తగస్వనుష్ఠిత పర
ధర్మంబుకంటె, విగుణమైనను మేలు స్వీయధర్మంబు। తనకు
స్వభావమౌ దానిఁగావించి, కనఁబోఁడు మనుజుండు కల్మష
చయము। వినుసదోషంబేని విడువంగరాదు, తనకును సహ
జమై తనరు కర్మముల.

అంతియకాదు.

శ్లో. శ్రేయాన్ స్వధర్మోవిగుణః, పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనంశ్రేయః, పరధర్మో భయావహః. 3-3౫

ద్వి. తగస్వనుష్ఠిత పరధర్మంబుకంటె, విగుణమైనను మేలు స్వీయ
ధర్మంబు। మరణమైనను స్వధర్మంబున మేలు, పరధర్మ మెప్పు
డుభయకారణంబు.

అనియుఁ జెప్పెను. అంతియకాదు.

శ్లో. అపిచేత్సుదురాచారో, భజతేమామనన్యభాక్
సాధురేవసమంతవ్యః, సమ్యగ్వ్యవసితోహిసః

క్షిప్రంభవతి ధర్మాత్మా, శశ్వచ్ఛాంతింనిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి, నమేభక్తః ప్రణశ్యతి
మాంహిపార్థవ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథాశూద్రా, స్తేపియాంతి పరాంగతిమ్.
౯-౩౨.

ద్వి. ....విగుల దురాచారుఁడైన నందక యితరులయందలి భక్తి నన్నే భజించు మానవుఁ డెవ్వఁడైన, వెన్నంగఁదగు సాధు వేయని జగతి। వాఁడు లెస్సగ దృఢభావంబుతోడఁ, గూడిన వాఁడయి కొలువెడిఁగాదె। వాఁడు ధర్మాత్ముఁడై వఱలు శీఘ్రముగ, వాఁడు శాశ్వత శాంతిపదంబుని బొందు। నిజము నాపై భక్తినిలిపినవాఁడు, విజయ నశింపఁడు వినుమిది నము తోడ జన్మమునఁ జేయు దురితంబుకతన, వెలఁదులు కో మట్లు వృషలులుగాఁగ। జనియించినట్టి యే జనులైనఁగాని, నను నాశ్రయించి యనంతమౌ గతిని। బొందుచున్నారు.

శ్లో. అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వంజ్ఞానప్లవేనైవ, వృజినం సంతరిష్యసి. ౪-౩౬

ద్వి. అదిగాక యఖిల పాపాత్ములకన్న; నధిక పాపాత్ముండవ దు వేనియును దరియింపఁగలవు పృథాసుతసకల, దురితం జ్ఞానమన తోరపునావ.

శ్లో. అజ్ఞశ్చా శ్రద్దధానశ్చ సంశయాత్మావినశ్యతి
నాయంలోకోస్తినపరో, నసుఖం సంశయాత్మనః. ౪-

ద్వి. అవివేకియును సంశయాత్ముఁ డౌవాఁడు విరహిత శ్రద్ధుండు
విజయునశించు; కరము సందేహంబు కలిగిన పురుషుఁ డీ
లోకమునఁ జెడు నింతియగాక, యాలోకమునఁ జెడు.

యని స్వమతధర్మము దాని యనుష్ఠానవిధము తెలియని వాఁడును, శ్రద్ధలేనివాఁడును, సంశయాత్ముఁడును నశింతురు గాని తక్కినవా రెంతటి పాపిష్ఠులైనను భగవంతుని వారి వారి వర్ణాశ్రమాచార పద్ధతులను శక్తివంచనలేక సేవించిరేని నరక భయము లేదని భగవంతుఁ డభయహస్త మిచ్చెను. ఈ కారణముచే నితర మతములవారు చెప్పెడి శాశ్వత నరకప్రాప్తి హిందూమతమునందు నుండు నెట్టి పాపికిని లేదు. మన మతౌత్కృష్ట్య మింతమాత్రమే కాదు.

## ఏకోపాయము సార్వజనీనమా.

ప్రకృతి గుణభేదముఁబట్టి యభిప్రాయభేదము నాచార భేదము లోకమునఁ గానవచ్చుచున్నవి. లోకులందఱు నేక విధాభిప్రాయము, నేక విధాచారము, నేకరుచి గలవారుకారు. దానికి వారి వారి గుణము కారణము. ఎట్టి మార్గమైనను నిందఱకు నేకవిధమార్గము నుపదేశించిన ప్రయోజనము లేదు. శ్రేష్ఠమైన యాహారమను కారణముచే నందఱు వరియన్నముపర మాన్నము భుజింపవలసినదని రాజాజ్ఞ యైనచో బీదల బక్కల గతియేమి? వారివారికి సులభమైన పదార్థ మాహారించుట శ్రేయస్కరముగదా. దేహమునకు నారోగ్యము బలము గలుగుట యుద్దేశ్యము. అట్టి పదార్థము వారివారి యోగ్యతకుఁ

దగినట్టు సంపాదించుకొని తినునుపాయమును చెప్పువారు బుద్ధిమంతులా. అటుగాక యందఱు నేకవిధమైన శ్రేష్ఠాహారము గైకొనుఁడని శాసించువారు బుద్ధిమంతులా. చనుఁబాలుత్రాగు బిడ్డలకు లడ్డుగాని రొట్టెగాని రాగిసంకటిగాని పెట్టిన నేమగును?

తక్కిన మతములవారు జ్ఞానమార్గము అవ్యక్తోపాసనము శ్రేష్ఠమనియు నందఱు తన్మార్గమే యనుష్ఠింపవలయుననియు శాసించిరి. మన మత పూర్వులు వారివారి యోగ్యతకుఁ దగిన మార్గముపదేశించిరి. ఈ యిరువురిలోఁ బ్రాజ్ఞులెవ్వరు? దేవాలయములు, విగ్రహారాధనము కలుగుట కిదియొక కారణము కావునఁ బూర్వులార్యులు భూత పూజచేయువారను మన మతతత్త్వమెఱుఁగని వారి యభిప్రాయము మనకు గ్రాహ్యముగాదు. బ్రహ్మసూత్రముల ప్రకారము జీవకోటియంతయు మోక్షమును బొందునుగాని యొక జీవియైన మోక్షమునకునే నాఁటికైన నొకనాఁటికిఁ బోక యుండునది లేదు. ఎప్పుడు పోవుననునది వారువారు చేయు కృషికొలఁదియుండును ఆకాశయానమునఁ గూర్చుండువాఁడు కాశికి నొక నాఁటఁ జేరును. ధూమశకటమునఁ బయనించువాఁడు నాలుగు దినములకుఁ జేరును. ఇట్లులే గుఱ్ఱముపైఁ బయనించు వానికెక్కువకాలము పట్టును. నడచిపోవువాని కంతకంటె నెక్కువ కాలము పట్టును. అట్టులే మోక్షప్రాప్తియు.

శక్తిసామర్థ్యములు, శ్రద్ధాభక్తులు, కర్మాచరణాస్థ వీని కొలఁది యేవర్ణమం దేవశయందుండు వాఁడైన నాజన్మమందో,

మఱుజన్మమందో, యనేక జన్మాంతరముల కావలనో ముక్తినొందును. కావున శూద్రుడైనను జండాలుఁడైనను దనవర్ణాచారములు నిర్వంచనముగ నడపుచుఁ బరిపూర్ణ భక్తియుక్తుఁడయ్యేనేని వానికా జన్మమందే మోక్షముగలదు. పరిపూర్ణ పరమభక్తి జ్ఞానములుగల వానికిఁ గర్మలోపభయము లేదు. అంతటి భక్తి లభించువఱకు వర్ణాశ్రమాచార ధర్మముల వదలరాదు. ఆ జన్మమందే సద్యోముక్తికిఁ జాలినంత భక్తి జ్ఞానములు లేనివాఁడయ్యేనేని మఱుజన్మముల నే జాతియందు నే వంశమందు జనించిన నాకొఱఁత పూర్ణమగునో యట్టివంశమందు జన్మించును. ఇవి యన్నియు భక్తి జ్ఞానములు కుదురుటకు సోపానములు. పక్షివలెఁ గ్రిందినుండి పైకెగుర లేనివాఁడు చీమవలె మెట్టు వెంట మెట్టెక్కి క్రమముగఁ బోవలయును. అంత కెక్కువ శక్తిగలవాఁడు రెండు మూఁడు సోపానము లొక్కసారిగ దాఁటుచు మేడపైకి పోవచ్చును. అట్టులే శూద్రుఁడు పరమభక్తిచే నా జన్మమందే ముక్తుఁడగును. అంతటి భక్తిసేయనివాఁడు చేసిన దానికి ఫలముగ యోగ్యతకుఁదగిన యుత్తమ జన్మంబుఁగాంచును. హనుమంతుఁడు సముద్రమును దాఁటినట్లు వానరులందఱు సముద్రమును దాఁటవలయునని శ్రీరాముఁడు శాసింపఁడయ్యెను. శక్తిగల వానరులు దాఁటిపోవచ్చును; కొందఱీఁది రావచ్చును; కొందఱు సేతువుపై నడవవచ్చును. ఇందఱు చేరునది సముద్రము నావలియొడ్డే. శ్రీరాముఁడందఱు సేతువుపై నడువవలసినదని యాజ్ఞాపించుటచే మూఢుఁడుగాఁడు. అట్లు

పోయినవారును మందులుగారు. దాఁటఁగలిగిన హనుమంతుఁడును నందఱు వానరులతో పాటు నడచియేపోయెను గాని తనవలె నెగసి దాఁట లేనివారిని మూఢులని యాక్షేపింపలేదు గదా. కావున గమ్యస్థానముఁ జేర్చు మార్గము కష్టమైనంతనే యది శ్రేష్ఠమనియు సుగమమైనది నికృష్టమనియు నెంచరాదు.

## సాకార నిరాకారోపాసనములందేది | శ్రేష్ఠము.

అవ్యక్తమయిన యక్షరమును పాసించుట శ్రేష్ఠమా? మూర్తిమంతుఁడైన యవతారమూర్తిని నుపాసించుట శ్రేష్ఠమా యని యడిగిన నర్జునునకు శ్రీకృష్ణుఁడు.

శ్లో. మయ్యావేశ్య మనో యే మాం, నిత్య యుక్తా ఉపాసతే
శ్రద్ధయాపరయోపేతా, స్తేమే యుక్తతమా మతాః॥
యే త్వక్షరమనిర్దేశ్య, మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగమచింత్యంచ, కూటస్థమచలం ధ్రువమ్
సంనియమ్యేంద్రియగ్రామం, సర్వత్రసమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ, సర్వభూత హితేరతాః॥
క్లేశోధిక తరస్తేషామవ్యక్తా సక్తచేతసామ్
అవ్యక్తా హిగతిర్దుఃఖం, దేహవద్భిరవాప్యతే. భగవ ౧౨.
అని బోధించెను.

ద్వి. మనసును నాయందు మానకనిల్పి, యనయంబు యుక్తా
త్ములై ఘనశ్రద్ధ । వారక నన్ను నే వారు సేవింత్రో, వారు
యుక్తతములు పార్థసమ్మతులు । అరసి నిర్దేశింప నలవిగానిది

యుఁ, బరఁగుచు నంతట వ్యాప్తమానదియుఁ। దెలియంగ
రానిది, స్థిరమైనయదియుఁ, జలియింపనిది యెంచక శక్యము
గానిది। యును గూటస్థమై దీపించునదియు, నయిన యక్షర
మింద్రియగ్రామములను। జక్కఁగ నియమించి సర్వంబు
నందు, నొక్కటియగా బుద్ధియొప్ప నెవ్వార। లన్నిభూతముల
హితాసక్తి వఱలు, చున్నారో వారొందుచున్నారు నన్ను
అవ్యక్తమునయందు నాసక్తిగలిగి, భవ్యమగా మనసున
వఱలువారలకుఁ। గలుగు మిక్కిలి యధికంబైన దుఃఖ;
మిల దేహధారిచే నెంతయు దుఃఖమునకు బొందఁగఁదగు
మొగినివ్యక్త, మునకు సంబంధమై మొనయు మార్గంబు.

జ్ఞానమార్గమున నవ్యక్తోపాసకులకు గాసి యొక్కటియే విశేషము. ఫలమునందు విశేష మేదియు లేదు. అంతియ కాదు. భక్తిచేఁ దన్ను సేవించువారు పరమపాపులయినను దరింతురని చెప్పఁబడిన ౯-వ యధ్యాయమందు మొదటనే యీ మార్గము సుగమము ప్రత్యక్షానుభవమునకు వచ్చునది యవ్యయమైనది. గావుననే యుత్తమమని శ్రీకృష్ణుఁడు చెప్పెను.

శ్లో. రాజవిద్యా రాజగుహ్యం, పవిత్ర మిదముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం, సుసుఖం కర్తు మవ్యయమ్. ౯-౨

అంతియ కాదు. మనుష్యాకారమునఁ గానవచ్చు తన మహిమ మూఢు లెఱుంగలేక మనుష్యుఁడనియే తన్నుఁ దలంతురనియు శ్రీకృష్ణుఁడు సెలవిచ్చెను.

శ్లో. అవజానంతి మాంమూఢాః, మానుషీంతనుమాశ్రితమ్
పరంభావమజానంతో, మమ భూతమహేశ్వరమ్. ౯-౧౧
అవ్యక్తం వ్యక్తిమాపన్నం, మన్యంతే మామబుద్ధయః
పరంభావమజానంతో, మమావ్యయమనుత్తమమ్. భగవ౭-౨౪

ద్వి. భూతనియామకమున సమర్థంబు, నాతతమా నామహాభావ
మెదను! దెలియంగఁ జాలని ధీవిరహితులు, వలనుగ మనుజ
సంబంధ దేహమును! జేకొన్న న న్నుపేక్షింతురుపార్థ;
అవి వేకులగువార లవ్యయమజము, నవిదితోత్తమమునై
యమరు నాపరమభావంబుఁ దెలియక వ్యక్తుండు వ్యక్తుఁ
డై వఱలెడి నంచునాత్మ నన్నెంత్రు.

ఇట్లు చెప్పి తన్నేమిగాఁ గొలువవలయునో యా విధ
మిట్లు చెప్పెను.

శ్లో. సతతం కీర్తయంతో మాం, యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా, నిత్యయుక్తా ఉపాసతే.
భగవ. ౯-౧౪.

మత్కర్మకృన్మత్పరమో, మద్భక్తస్సంగవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు, యస్సమామేతి పాండవ. ౧౧-౫౫
మన్మనా భవ మద్భక్తో, మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే, ప్రతిజానే ప్రియోసి మే. ౧౮-౬౫
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో, మోక్షయిష్యామి మా శుచః.
౧౮-౬౬.

ద్వి. ఏకాలమున నన్నె యెలమిఁ గీర్తింత్రు; నా కొఱకై ప్రయ
త్నముఁ జేయుచుందురు। ప్రాకటంబుగ దృఢవ్రత పరు
లగుచు, నాకుఁగా నభివాదనములు గావింత్రు,। చేకొని
నిరతము శిథిలమౌభక్తి, న్నన్ను నుపాసింత్రు నా కేంద్రతనయ।
కౌంతేయ నాకుఁగాఁ గర్మముల్ సలిపి, యెంతయు మద్భక్తి
యెద నిండియుండఁ దనగతి నేనె కాఁదలఁచుచు స్నేహ,
మును చేనియందును బూనక సర్వ। భూతాళియెడ వైర
మును బాసినట్టి, పూతచిత్తుఁడు నన్నె పొందును బార్థ।
నాయందె మనమును నాటుము, భక్తి నాయందె నిలు
పుము, నన్నె పూజింపు। నాకె మ్రొక్కుము ప్రతిజ్ఞయును
గావింతు, నా శిష్టుఁడునునయి నన్నె పొందెదవు। అన్ని
ధర్మంబుల నావలఁ ద్రోచి, న న్నొకనినె శరణంబును
జొరుము। అన్ని పాపంబులనుం డుండి నేను, నిన్ను ముక్తు
నొనర్తు నిర్వేదపడకు ॥

ఈ యన్ని వాక్యములవలన స్వవర్ణాశ్రమ ధర్మముల నను
సరించి వర్తించు వాఁడెట్టి పాపజాతిగాని యెట్టిపాపిష్ఠుఁడుగాని
కర్మయోగముచేతనో జ్ఞానయోగముచేతనో సిద్ధ భక్తిచేతనో
సాధ్యభక్తిచేతనో ముక్తి కర్హుఁడు కావచ్చునని వేదాంత రహస్య
మును శ్రీకృష్ణభగవానులు రణరంగమునఁ గర్తవ్యమున మూ
ఢుఁడైన నర్జునున కుపదేశించెను.

శ్లో. ధ్యానే నాత్మని విందంతి, కేచి దాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన, కర్మయోగేన చాపరే

అన్యే త్వేవ మజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే
తేపి చాతి తరంత్యేవ, మృత్యుం శ్రుతి పరాయణాః.

౧౩-౨౪, ౨౫.

ధ్వ ఆత్మను గొందఱు ధ్యానంబు బలిమి, నాత్మచేత నె కందురాత్మయం దనఘ! జనులు కొందఱు గండ్రు సాంఖ్యయోగమున, గనుదురు కొందఱు కర్మయోగమున; మిగిలినవారలేమియు నెఱుంగకయుఁ, దగ విని యన్యుచేతను పాసింత్రు! వినుటయం దాసక్తి వెలయువారలును, ఘనమృత్యుబాధను గడచిపోయెదరు! కావున భగవంతుఁ డొక్కఁ డున్నాఁడు. ఆయన భక్తరక్షాదీక్షుఁడు. కరుణాపరుఁడని! నమ్మి యెవ్వరే విధమునఁ బూజించినను ధ్యానించినను ముక్తి పొందుటయందు! సందేహింపవలసినదిలేదు. మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ శర్వశ యని భగవంతుఁడే చెప్పెను.

ఏది యెవనికిఁ గులాచారపద్ధతిని స్వధర్మమో యదియే వానికి శ్రేయస్కరము కాని యితరుల ధర్మము గొప్పదైనను వానికి శ్రేయస్కరము కాదు. వనచారులైన యెఱుకులు చెంచులు నల్పవనమూలికలచేఁ దమవ్యాధులఁ గుదుర్చుకొందురు. ధనికులు మహారాజులు బంగారు రత్నములు కలసిన యౌషధముల సేవింతురు. ఫలము వ్యాధిహరించుట యిరువురయందు సమానము. అట్టులే మృష్టాన్నమొకని యాఁకలినణఁచును. సంకటి యొండొకని యాఁకలి నణఁచును. ఒకరినిజూచి యొకరసూయపడఁ గారణములేదు. బంగారు, వజ్రములు, మంచి

ము త్తైములు లోనైనవి కలిపిచేసిన యౌషధమును దినక వన మూలికలతో వ్యాధులు కుదుర్చుకొనువారు మూర్ఖులని ధని కులన వలసిన పనియు లేదు. అట్లులే "నారలుగట్టి కూరల శనంబుగ" గానలనుండు మానులను వారిభక్షులు పర్ణ భక్షులు వాయుభక్షులు శాకనీహారభక్షులునగు వారిని షడ్ర సోపేత భోజనా సక్తులగు వారాక్షేపింపఁబనిలేదు. అట్లనిరేని వారి మౌర్ఖ్యమే ప్రకటమగును. అట్లులే భక్తుల, దేవాలయ ములను, బేరా రాధనమును* దూషించువారు తమ యవి వేకమునే వెల్లడించుకొందురు.

## ఎట్టి వారికి బేరపూజ?

"ప్రతిమా మందబుద్ధీనా" మ్మని మందబుద్ధులకు విగ్ర హారాధనమని కొందఱందురు. ఇందుఁ జెప్పఁబడిన మంద బుద్ధు లెట్టివారు? ఇది చేయుని పండితు లెట్టివారు? ఈ విషయము కొంత చర్చింపవలసియున్నది. మన శాస్త్రములు విగ్రహారా ధనము కొందఱ కనావశ్యకమని, కొందఱ కావశ్యమని చెప్పు చున్నవి. ఎవ్వరి కనావశ్యకము ఎంతవఱ కనావశ్యకము.

శ్లో॥ అష్టాంగ యోగసిద్ధానాం, హృద్యాగనిర తాత్మనామ్
యోగినా మధికార స్స్యా, దేకస్మిన్ హృదయేశయే॥

అష్టాంగయోగమున సిద్ధులై హృదయమునందుండు భగవన్మూర్తిని నర్చించుయోగులు హృదయమందే యర్చింప

---

* బేరపూజ = ఆగమములందు శరీర పూజను బేరపూజయని చెప్పఁ బడినది. బేరమనఁగా శరీరము దీనిని గుబేర శబ్దమునందుఁ గననగు.

నధికారులుగాని తక్కినవారు కారు. 'ధ్యాయన్ కృతే' యన్నట్లు కృతయుగమున ధర్మము నాలుగుపాదముల నడచుచుండుటచే నిట్టి హృద్యాగము సులభమగుట ననేకు లిట్టి యోగసిద్ధు లుండిరి. అనేకులని చెప్పితినిగాని యందఱు నని చెప్పలేదు. ఇట్టి యోగసిద్ధులలోనివాఁడని ప్రహ్లాదుఁ జెప్పినవెంటనే హిరణ్య-కశిపుఁడును స్మృతికి వచ్చునుగదా? ఇట్టి యోగసిద్ధి పండితులకు లభించును. పండితులనఁగా వైయాకరణులు-తార్కికులు-నైయాయికులు-కలాశాలలయందలి పండితులుగారు.

శ్లో. యస్యసర్వేస మారంభాః, కామసంకల్ప వర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం, తమాహుఃపండితఃబుధాః భగవ. ౪-౧౯
కర్మణ్యకర్మయః పశ్యదకర్మణి చకర్మయః
సబుద్ధిమాన్ మనుష్యేషు, సయుక్తః కృత్స్నకర్మకృత్. ౪-౧౮

ద్వి. శతమఖతనయ! యేజనునికర్మములు, చ్యుతకామ సంకల్ప యుక్తంబులగునో। యట్టి జ్ఞానాగ్ని దగ్ధాఖిలకర్ము, నెట్టన బుధులండ్రు, నెఱపండితుఁడని। కర్మంబున నేవం డకర్మంబుఁ గనునో, కర్మ మకర్మానఁ గాంచునో యెవఁడు। వాఁడెపో నరులందుఁ బ్రాజ్ఞుండు యోగి, వాఁడె కర్మముల న్నిపచరించు వాఁడు.

ఇట్టివారు పండితులు బుద్ధిమంతులు. ఇట్టివారికి విగ్రహారాధన మనావశ్యకము కావచ్చునుగాని నిషిద్ధముగాదు, ఏల యనావశ్యకమన.—

శ్లో. యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం
కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిమ్
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ
నిరంజనః పరమం సామ్య ముపైతి.

ఎప్పు డాత్మావలోకన తత్పరుఁడగు వాఁడు బంగారువర్ణము గల పురుషుని, బ్రహ్మకుఁ గారణభూతుఁ డైనవానిని, జగదీశ్వరుని, జగత్కర్తను, జూచునో యప్పు డా పండితుఁడు పుణ్యపాపముల రెంటిని విదలించుకొని నిరంజనుఁడై భగవంతుని పరమసామ్యమును బొందునని ముండకోపనిషత్తునం దుండుటచే భగవత్సాక్షాత్కారము లేక ముక్తి లేదు. అట్టి భగవత్స్వరూపమును వారు తమ హృదయమందే దర్శింతురు. కావున నట్టి పండితులకు బాహ్యపూజ యేల? యోగుల నన్యసాహాయ్యమేదియు నపేక్షింపరు. వారి వాయు సూర్య కిరణములచే జీవించున నన్యసహాయులకు వరియన్నము పప్పులుపులుసులు చారులు పచ్చళ్లు దిని జీవింపఁ బ్రయాసపడువారు తక్కువవారే కదా. అట్లని మన యట్టివారు వీనిని విడనాడవలయునా?

ఎట్టివారు మూఢులు?

అవి ద్యాయా మంతరే వర్తమానాః
స్వయంధీరాః పండితమ్మన్యమానాః
దంద్రమ్యమాణా పరియంతిమూఢా
అంధేనైవనీయమానా యథాంధః

ఉత్క్రామంతం స్థితంవాపి, భుంజానం వాగుణాన్వితమ్
విమూఢా నానుపశ్యంతి, పశ్యంతిజ్ఞాన చక్షుషః భగవ. ౧౫-౧౦

తమ్ముఁ దామే పండితులనుకొని యజ్ఞానమున మునిఁగి గ్రుడ్డివానిచేఁ బిలుచుకొనిపోఁబడు గ్రుడ్డివానివలె సంసారమున మునుఁగుచుఁ దేలుచు మూఢులు చుట్లఁ బెట్టుచుందురు.

దేహమునందుండి వెడలిపోవునపుడుకాని, దేహమునందుండి గుణముల మూలమున సుఖదుఃఖముల ననుభవించునపుడుకాని జీవునిని జ్ఞాననేత్రముగలవారు చూతురుగాని మూఢులు చూడఁజాలరు.

విగ్రహారాధనము చేయువారికంటె వారి నాక్షేపించువారు మూఢులో జ్ఞానులో వారి నడత పరిశీలించు విజ్ఞు లెఱుంగుదురు.

కృతయుగమందైనను లోకులందఱు నింతటి యోగసిద్ధులు గారుగదా. వారి విషయ మేమి చెప్పఁబడెనో చూతము

శ్లో. వ్యామిశ్ర యోగముక్తానాం, విప్రాణాం వేదవేదినామ్
మంత్రేతు చాతుర్వ్యూహేతు, అధికారో న చాన్యథా.

వేదవేదులయి గృహస్థులగుటచే మిశ్రపూజ (అంతరపూజ - బాహ్యపూజ రెండును) చెప్పఁబడిన బ్రాహ్మణులకు సమంత్రకమైన వాసుదేవాదిమూర్తి పూజయం దధికారము గలదు. మఱి వేఱువిధముగ లేదు.

శ్లో. త్ర. యాణాం క్షత్రి యాదీనాం, ప్రపన్నానాం చ తత్త్వత
అమంత్ర మధికారస్తు, చాతుర్వ్యూహ క్రియాక్రమే.

ప్రపన్నులును క్షత్రియ వైశ్య శూద్రులును వాసుదేవాది మూర్తులను నమంత్రముగఁ బూజింప నధికారము గలదు.

కావుననే కృతయుగమందును నిక్ష్వాకుమహారాజు శ్రీ రంగనాథుని గులధనముగ నుంచుకొని పూజించుచుండెను. శ్రీ రామాయణమునఁ జెప్పఁబడిన నిక్ష్వాకు కులధన మిదియే యని వ్రాయఁబడియున్నది.

మీఁదఁ జెప్పఁబడిన యోగసిద్ధులు గాక తక్కినవారం దఱు విగ్రహారాధనము చేయవలసినది విధి. ఏలన వారికా యోగసిద్ధి యొక జన్మముననే లభించినదికాదు. వారెన్నివేల జన్మములనుండియో సాధింపఁగా నీ జన్మమున వారు సిద్ధులైరి.

శ్లో. ప్రయత్నా ద్యతమానస్తు, యోగీ సంశుద్ధ కిల్బిషః
అనేకజన్మ సంసిద్ధ, స్తతో యాంతి పరాంగతిమ్. భగవ ౬-౪౫

ద్వి. పరమప్రయత్నం బుపచరించు యోగి, దురిత దూరుండయి
తొలి పెక్కుభవము । లందు సిద్ధిని బొంది యటమీఁదఁ
బొందు, నందనా! యరుగునున్నత పరగతికి.

శ్లో. యజ్ఞ దానతపః కర్మ, నత్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞో దానం తప శ్చైవ, పావనాని మనీషిణామ్.

భగ. ౧౮-౫.

ద్వి. దానంబు యజ్ఞంబు తపమును విడువ, రానివిః యవియుఁ
గార్యంబు లే చుమ్ము. । దానంబు యజ్ఞంబు తపము మనీషి,
మానవోత్తముచేఱి పావనునిఁగ ॥

అను విధి ననుసరించి యనేక జన్మములందు యజ్ఞము దానము తపస్సు చేసిచేసి యోగ మభ్యసించి పాపముల నెల్ల

సారింపఁజేసి, మనస్సు నిర్మలము చేసికొనుటచేఁ గొఱఁతగా నున్న సిద్ధి యీ జన్మమున వారికి లభించెను. అంతియకాని,

"జప తపోనుష్ఠానములు చెప్పిరి మూఢులకై బుధులు—"

మ. ఉపవాస వ్రతశీల శౌచమఖ సంధ్యోపాసనాగ్ని క్రియా
'జపదానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి చేకూరదు'॥

అనియుండుట గాంచి భ్రాంతులై పరమభక్తి కుదురువఱకు వీనిని విడుచువా రుభయభ్రష్టులగుదురు కావున బ్రతిమామందబుద్ధీనా మ్మనుట నహి నిందా న్యాయముననే కాని వాస్తవమునఁ గాదు. అట్లు గాదేని రామ, కృష్ణ, శంకర రామానుజ మధ్వాచార్య కృష్ణ చైతన్యాదుల మాటయేల? పాంచరాత్రాగమము నారదున కుపదేశించిన శ్రీమన్నారాయణుఁడు మూఢుఁడే. దానిని వాల్మీకివ్యాస శౌనకాదుల కుపదేశించిన నారదుఁడు మూఢుఁడే. ఉద్ధవునకుఁ జరమోపాయముగ

శ్లో. అర్చాదిషు యదా యాత్ర, శ్రద్ధా మాం తత్ర చార్చయేత్

*  *  *  *  *  *

అర్చ న్నుభయత స్సిద్ధిం, మత్తో విందత్యభీప్సితామ్
మదర్చాం సంప్రతిష్ఠాప్య, మందిరం కారయే ద్దృఢమ్
పుష్పోద్యానాని రమ్యాణి, పూజా యాత్రోత్సవాశ్రితాః
యస్స్వదత్తాం పరై ర్దత్తాం, హారేత సురవిప్రయోః
వృత్తిం సజాయతే విడ్భు, గ్వర్షాణా మయుతా యుతమ్.

భాగ. ౧౧-౨౭.

నుపదేశించిన శ్రీకృష్ణుఁడు మూఢుఁడే కదా కావున విగ్రహారాధకులు బుద్ధిమంతులో వివేకులు పరిశీలింతురు గాక. శ్రీకృష్ణలీలామృతము తృతీయచుళుకము పుట చూడుఁడు.

## ఉత్తముల కర్తవ్యమేది.

విగ్రహారాధనము చేయు భక్తులను బుద్ధిలేనివారని దూషించి నీ మహాజ్ఞాను లధికులనియే యంగీకరింతము. ఇట్టి వారి కెట్టిచర్య ప్రశస్తమని శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి? వీర రణ్యసంచారము చేయువారుకారు. ఏకాంతులుగారు. పట్టణవాసులు జనులనడుమఁ బ్రముఖులమని తిరుగువారు. ఇట్టివారి కెట్టిది సముచితకార్యము?

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ, స్తత్త దేవేతరో జనః
స యత్ప్రమాణం కురుతే, లోక స్తదనువర్తతే. ౩-౨౧
న మే పార్థాస్తి కర్తవ్యం, త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం, వర్త ఏవ చ కర్మణి. ౨౨
యది హ్యహం న వర్తేయం, జాతు కర్మ ణ్యతంద్రితః
మమవర్త్మానువర్తంతే, మనుష్యాః పార్థసర్వశః. ౨౩
ఉత్సీదేయు రిమే లోకా, నకుర్యాం కర్మ చేదహమ్
సంకరస్య చ కర్తాస్యా, ముపహన్యా మిమాః ప్రజాః. ౨౪
సక్తాః కర్మణ్యవిద్వాంసో, యథా కుర్వంతి భారత
కుర్యా ద్విద్వాం స్తథాసక్తశ్చికీర్షు ర్లోకసంగ్రహమ్. ౨౫

న బుద్ధిభేదం జనయే, దజ్ఞానాం కర్మసంగినామ్
జోషయే త్సర్వకర్మాణి, విద్వాన్ యుక్త స్సమాచరన్. ౨౬
ప్రకృతే ర్గుణసమ్మూఢాః, సజ్జంతే గుణకర్మసు
తా నకృత్స్నవిదో మందాన్, కృత్స్నవి న్న విచాలయేత్.
భగవ. ౩. ౨౯.

సీ. ఎది శ్రేష్ఠుఁ డొనరించు నితరజనంబు, నదియ కావించునో యయ్య! వాఁడేది। సప్రమాణంబని చలుపునో మూఢుఁ, డా ప్రకారమె సల్పు నమరేంద్రతనయ। చలుపంగఁదగిన కర్మం బింతయైనఁ, గలుగదు నాకు, నేఁ గాంక్షింప నర్హము గనది లే, దన వాప్తంబు లేదు, జగములమూఁట, నేఁ జలుపు చున్నాఁడఁ। గాదె కర్మంబుల? గాండీవి, యప్ర, మాదంబు కల్గిఁ గర్మంబులయందు। నెప్పుడేనియు నుండ నేనియు జనులు, నప్పుడ నామార్గ మనుసరించెదరు. నేను గర్మమును జేయ నేని యీ జనము, లోగు నొందెదరంత నొదవు సంకరము దానికి నేనకర్తగనొచు జనుల, హానిని ముంచిన యతఁడనే నౌదు। పామరు లాసక్తి పరతఁగర్మంబు, నేమాడ్కిఁ గావింతు రింద్రజ! యట్లు। జనరక్ష సేచ్ఛఁచేజ్ఞాని యాసక్తిఁ, గనక కర్మంబులఁ గావింపవలయు। అజ్ఞానులయిన కర్మాసక్తులకును, విజ్ఞుండు తగదు ధీవికలతఁ గూర్పఁ, జలుపుచుఁ గర్మముల్ స్వీయము హెచ్చరికఁ, జెలఁగి వారల చేతఁ జేయింపవలయు, అన ఘూత్మప్రకృతి గుణావళిచేత, నవి వేకులయి యింద్రియ విషయములను దవులుమందుల నకృత్స్నవిదులబుధులు,

చలితచిత్తులుగాఁగఁ జలుపంగఁదగదు. ప్రముఖు లెట్లు చేయుదురో తదితరులు నట్లే చేయుదురు. కావునఁ బ్రముఖులుగా నుండువారు జ్ఞానులై తమకుఁ గర్మములతోఁ బనిలేదని తలఁచినను పామరులను జక్కఁబెట్టుటకై వారి కేదిమేలో యట్టి శాస్త్రీయకర్మములు తాము చేయవలయుననియు, నట్లు చేయుటయందు దాసీనభావముఁ జూపక పామరు లెట్లు లాసక్తితోఁ గార్యములు చేయుదురో యట్లే జ్ఞానులు నా కర్మములయందుఁ దమకు శ్రద్ధాభక్తులు లేకున్నను నాసక్తితోఁ జేయువారివలెనే చేయవలయుననియు, నట్లు చేయరేని లోకమును వక్రమార్గమున వర్తింపఁజేసిన పాపమునకుఁ బాలుపడుదురనియుఁ, గర్మములు చేయుమూఢులకు బుద్ధి భేదము జ్ఞాని యైనవాఁడు కలిగింపరాదనియు నట్లు కలిగించిరేని పామరులు కర్మములు మానుటచేతను, జ్ఞానాధికారులు గాకుండుటను రెంటను జెడుదురనియుఁ జెప్పిన కృష్ణవాక్యములు వీరికిఁ బ్రమాణములు గావు కాఁబోలు. భక్తులుచేయునది భగవత్పూజగాని ప్రకృతిగుణావళిచేత నవి వేకులయి చేయు నింద్రియవిషయ పూజగాదు. ఇట్టి భక్తులమనస్సులు చలింపఁజేయు వారిని దూషించు జ్ఞానింమన్యులకంటె నజ్ఞానులు పాపులు మఱియెవ్వరు?

ఇంద్రయాగము మానిపి గోవర్ధనగిరిని బూజింపుఁడని బోధించి గోపికాగోపకు లిచ్చుబలుల నెల్లఁ దానే యాహారించిన కృష్ణమూర్తికంటె వీరు బుద్ధిమంతులు కాఁబోలు. కృష్ణావతారంతత్త్వముఁ జూడుఁడు.

## దేవాలయకాలము.

దేవాలయములు నూతన సృష్టములని కొందఱు తలం తురు. అది సరిగాదు. దేవాలయములకు నాగమములు ప్రమాణ ములు. ఆగమముల ననుసరించి దేవాలయ నిర్మాణములు పూజలు జరగును. వీని ప్రామాణ్యమును గుఱించి యాగమ ప్రామాణ్యము పాంచరాత్ర రక్షలోనగు గ్రంథములందు విస్త రించి వ్రాయఁబడియున్నది. పాంచరాత్రాగమవక్త నారాయ ణుఁడు. ఉద్దేశము భక్తులయందలి దయ. విషయము వేదాంత సారము. ఇది వేదతుల్యము. తత్సమకాలికము. నాలుగాశ్ర మములవారి కనుష్ఠేయము. ఫలము భగవత్ప్రాప్తి.

### ప్రమాణవాక్యములు.

### నిస్సంశయ ముక్తిమార్గమేది.

శ్లో. అధీతా భగవన్! వేదా, స్సాంగోపాంగా స్సవిస్తరాః
శ్రుతానిచ మయాంగాని, వాకో వాక్యయుతాని చ ॥
న చైతేషు సమస్తేషు, సంశయేన వినా క్వచిత్
శ్రేయోమార్గం ప్రపశ్యామి, యేన సిద్ధి ర్భవిష్యతి ॥
వేదాంతేషు యథాసారం, సంగృహ్య భగవాన్ హరిః
భక్తానుకంపయా విద్వాన్, సంచిక్షేప యథాసుఖమ్ ॥
పరమసంహి॥

భగవంతుఁడా! వేదవేదాంగము లన్నిటిని నధ్యయనవ చేసితిని. అన్నిటియందును నిస్సంశయమైన శ్రేయోమార్గమ నాకుఁ గానరాలేదు. అట్టిదాని నా కుపదేశింపుమని వేఁడిన

శాండిల్యునకు భక్తానుకంపియగు భగవంతుఁడు నారాయణుఁడు వేదాంతసారమును యథాసుఖముగ ననుష్ఠింపఁదగు దానిని సంగ్రహముగ నుపదేశించెను.

మహాభారతమున మోక్షధర్మ పర్వమున జ్ఞానకాండమందు.

శ్లో. గృహస్థో బ్రహ్మచారీచ, వానప్రస్థో థభిక్షుకః
యఇచ్ఛేత్సిద్ధి మాస్థాతుం, దేవతాంకాం యజేతసః ॥
ఇదంశత సహస్రాద్ధి, భారతాఖ్యాన విస్తరాత్
ఆవిధ్యమతి మంథానం, దధ్నోఘృత మివోద్ధృతమ్ ॥
నవనీతం యథా దధ్నో, ద్విపదాం బ్రాహ్మణో యథా
ఆరణ్యకంచ వేదేభ్యః, ఓషధీభ్యో యథామృతమ్
ఇదం మహోపనిషదం, చతుర్వేద సమన్వితమ్
సాంఖ్యయోగ కృతాంతేన, పంచరాత్రాను శబ్దితమ్
ఇదంశ్రేయ ఇదం బ్రహ్మ, ఇదం హిత మనుత్తమమ్
ఋగ్యజు స్సామభిర్జుష్టం। మథర్వాంగిరసై స్తథా
భవిష్యతి ప్రమాణంవా, ఏత దేవానుశాసనమ్.
ఏవ మేకం సాంఖ్యయోగం వేదారణ్యకమేవచ
పరస్పరాంగాన్యే తాని, పంచరాత్రంతు కథ్యతే ॥
వేదేన పంచరాత్రేణ యఃపశ్యతి సపశ్యతి
ఇత్థం భూతస్య తంత్రస్య, విప్లవం యది శంకసే
సర్వత్రస్యా దనాశ్వాసః ఇత్యేత దుపదిశ్యతే
విరోధేపి వికల్పస్స్యాత్, భగవచ్ఛాస్త్రవేదయోః
విరోధ ఏవనాస్తీతి, ప్రాగే వప్రత్యపాదయమ్ ॥

పంచరాత్రస్య కృత్స్నస్య, వక్తా నారాయణస్స్వయమ్ ॥
నారాయణముఖోద్గీతం, నారదోశ్రావయన్ మునీన్
బ్రహ్మణస్స దనేతాత, యథాదృష్టం యథాశ్రుతమ్॥ భారత
వేదేన పంచరాత్రేణ, భక్త్యాయజ్ఞేనచద్విజ
ప్రాప్యోహం నాన్యథాప్రాప్యో, వర్షలక్షశతైరపి॥
పురాణైశ్చైవవేదైశ్చ, పంచరాత్రైస్తథైవచ
ధ్యాయంతి యోగినోనిత్యం, క్రతుభిశ్చయజంతితమ్॥
సాంఖ్యంయోగః పంచరాత్రం, వేదాః పాశుపతంతథా
ఆత్మప్రమాణాన్యేతాని, నహన్తవ్యాని హేతుభిః॥

బ్రహ్మచారికాని గృహస్థుఁడుకాని, వానప్రస్థుఁడుగాని సన్న్యాసిగాని సిద్ధిపొందుటకై యేదేవతను బూజింపవలయును. పెరుఁగువలన నేతివలె లక్షపరిమితిగల భారతామ్నాయమును మథించి తీయఁబడినది. పెరుఁగువలన వెన్నయు, ద్విపాత్తుల వలన బ్రాహ్మణుఁడు, వేదములవలన నారణ్యకము, నోషధుల వలన నమృతమువలె నాలుగువేదములతోను సాంఖ్యమునఁ జెప్పఁబడిన నిరువదియైదు తత్త్వములతోను, యోగమునఁ జెప్పఁబడిన యమనియమాసన ప్రాణాయామాదులతోను, వేదాంతకర్తృ స్వరూపములతోను, తత్త్వముల బ్రహ్మాత్మకత్వముతోను బ్రహ్మోపాసన ప్రకారముతోను భగవదారాధన రూపప్రకారములతోను గూడి మిక్కిలి రహస్యమైయున్నది. ఇదియే శ్రేయస్కరమైనది. ఇది బ్రహ్మము దీనినిమించిన హితములేదు. దీనికి ఋగ్యజుస్సామాథర్వణ వేదములు ప్రమాణములు. వేదము-

పంచరాత్రము-భక్తి-పూజ వీనిచే నేను బ్రాప్యుఁడనగుదునుగాని వేఱువిధముగఁ గోటిసంవత్సరములు శ్రమించినను బ్రాప్యుఁడఁగాను. పురాణముల చేతను వేదముల చేతను పంచరాత్రము చేతను యోగులు నన్ను ధ్యానింతురు. యజ్ఞాదులచేఁ బూజింతురు. వేదముల చేతను పంచరాత్రముచేతను దెలిసికొనినవాఁడే నిజము తెలిసికొనినవాఁడు. ఇట్టి పంచరాత్రము నెవఁడు సందేహించునో వాఁడన్నిటిని నమ్మనివాఁడే. సాత్త్వతము, భగవచ్ఛాస్త్రమను పేరుగల పంచరాత్రమునకు వేదమునకు విరోధము చెప్పువాఁడు వికల్పము చెప్పువాఁడగును. అనఁగా వేదమువలనను సిద్ధిగలదు. పాంచరాత్రమువలనను సిద్ధిగలదు అని రెంటిలో నొకటి యంగీకరించువాఁడగును. వేదమునకుఁ బంచరాత్రమునకు నట్టివిరోధము లేదు. పాంచరాత్రము సర్వము వచించినవాఁడు శ్రీమన్నారాయణుఁడే. ఇట్లు శ్రీమన్నారాయణుచే నుపదేశమునొందిన దీనిని నారదుఁడు తానువిన్నది కన్నది బ్రహ్మసభయందు మునులకు నెఱిఁగించెను. (ఈలోకమున వాల్మీకివ్యాసుల కుపదేశించెను. వారు దానిసారమును శ్రీమద్రామాయణమందును శ్రీభాగవతంబునను వెల్లడించిరి. సమంత్రకముగ బ్రాహ్మణులు చేయునట్టియు, నమంత్రకముగ క్షత్రియాదులు చేయునట్టియు విగ్రహారాధనమునకు నీ పాంచరాత్రాగమమే ప్రమాణము. 'వేదాగమపురాణము' లనుటచే యనాదులు. కావున విగ్రహారాధన మానాఁడు పుట్టినది. యీనాఁడు పుట్టినదని తెలియనివారు చెప్పుదురు.

విగ్రహారాధనమునకు మూలభూతమైన యోగమము వేదములకు వేరువంటిది. దీనికి నేకాయనమనిపేరు. మోక్షమునకిది తప్ప వేఱుమార్గములేదు. యమనియమాసనములు విడిచి ప్రాణాయామముతో యోగము నారంభించు నేఁటి యోగులెట్లు సిద్ధిఁగాంచలేరో యట్లే దీనిని విడిచి యితరమార్గముల ముక్తినొందఁగోరువారు కృతార్థులుగాఁ జాలరు. దీనికి ముముక్షునధికారి. ఇతరులుగారు. అధికారిగాని వానికిదిరుచింపదు. ఈ విషయమైన వాక్యముల వినుఁడు. పృథివ్యాదులగునైదు తత్త్వములకును, దేహి యజ్ఞానాంధకారమునకును విలక్షణుఁడై భుక్తి ముక్తి ప్రదాయకుఁడైన విష్ణువును గుఱించి చెప్పు గ్రంథములు పంచరాత్రము.

శ్లో. పృథివ్యాదీని తత్త్వాని, గుణాః పంచ మహామునే
రాత్రయోః దేహినః ప్రోక్తా, అవిద్యా చైవ తత్త్వతః॥
తేభ్యో విలక్షణం, విష్ణుం భుక్తి ముక్తి ప్రదాయకమ్
దర్శయంతిచ యే గ్రంథాః, పంచరాత్రం ప్రకీర్తితాః॥
ప్రయోజనంచ శాస్త్రస్య, మోక్షః ప్రకృతిదుర్లభః
అభిధేయం భగవతః, సమారాధన ముత్తమమ్॥
సంబంధోఽపీష్యతే సద్భిః, సాధ్యసాధన లక్షణః
ముముక్షు రధికారీ స్యా, దితి శాస్త్రేషు నిశ్చితః॥

"ఇతి దృష్టాదృష్టోభయశ్రుతిమూలకత్వాన్మోక్షముఖ్యఫలకత్వాద్భగవదుపజ్ఞత్వాన్ముముక్షుభిః పంచరాత్రోదిత వర్త్మ మనుష్ఠేయ మితినిష్కర్షః॥" ఆలయనిత్యార్చన పద్ధతి.

శ్లో. మహతో వేదవృక్షస్య, మూలభూతో మహానయమ్
స్కంధభూతా ఋగాద్యాస్తే, శాఖాభూతాశ్చ యోగినః॥
శృణుధ్వం మునయ స్సర్వే, వేద మేకాయనాభిదమ్
మోక్షాయనాయ వై పంథా, ఏతదన్యో నవిద్యతే
తస్మాదేకాయన న్నామ, ప్రవదంతి మనీషిణః॥ పాద్మసంహిత

శ్లో. పాదేస్మికాపిలస్థైః కణభుగనుగతైరవ్యృద్ధవై భాషికాద్యై
ర్యోగాచారాభిధానై స్సుగతమతరహస్యాన్యవాదప్రసక్తై
రర్హత్సిద్ధాంతభక్తైః పశుపతిసమయస్థాయిభిశ్చోపరోధం
క్షిప్త్వాధం పాంచరాత్రం శ్రుతిపథమవదత్ పంచమా
మ్నాయదర్శీ - దేశిక.

## దేహము - దేవాలయము.

యోగులు సాకారుఁడైన భగవంతుని సూర్యమండల మధ్యమందును, హృదయగుహాయందును, గంటిపాపయందును జూతురు. కావుననే "దేహో దేవాలయః ప్రోక్తః" దేహము దేవాలయమని చెప్పఁబడియె. కావుననే దేవాలయము దేహమునట్టిదయగు. హృదయగుహాయందుండి యోగులచే నుపాసింపఁబడు భగవత్స్వరూపము శ్రీభాగవతమున ద్వితీయస్కంధంబున నిట్లు వర్ణింపఁబడినది.

శ్లో. కేచి త్స్వదేహాన్తర్హృదయావకాశే
ప్రాదేశమంత్రం పురుషం వసంతమ్
చతుర్భుజం కంజరథాంగశంఖ
గదాధరం ధారణయా స్మరంతి॥

ప్రసన్నవక్త్రం నలినాయతేక్షణం
కదంబకింజల్క పిశంగవాసనమ్
లసన్మహారత్న హిరణ్మయాంగదం
స్ఫురన్మహారత్న కిరీటకుండలమ్ ॥
ఉన్నిద్రహృత్పంకజ కర్ణికాలయే
యోగీశ్వరాస్థాపిత పాదపల్లవమ్
శ్రీలక్షణం కౌస్తుభరత్నకంధరం
అమ్లానలక్ష్మ్యా వనమాలయా చితమ్ ॥
విభూషితం మేఖలయాంగుళీయకై
ర్మహాధనై ర్నూపురకంకణాదిభిః
స్నిగ్ధామలైః కుంచితనీలకుండలై
ర్విరోచమానానన హాసపేశలమ్ ॥
అదీనలీలాహాసి తేక్షణోల్లసత్
భ్రూభంగసంసూచిత భూర్యనుగ్రహమ్
ఈక్షేతచింతామయమేన మీశ్వరం
యావన్మనో ధారణయావతిష్ఠతే ॥
ఏకైకశోంగాని ధియానుభావయే
త్పాదాదియావద్ధసితం గదాభృతః
జితం జితం స్థాన మపోహ్య ధారయేత్
పరం పరం శుధ్యతి ధీ ర్యథా యథా ॥

ఇట్టి సాకారభగవత్స్వరూపమునే కదా భక్తులు దేవాలయములు దర్శింతురు. ధ్యానింతురు. పూజింతురు. ఇఁక సూర్యమండలమందు సాకారుఁడై భగవంతుఁడున్నాఁడనుటకు.

"పూష న్నేకర్షే యమ సూర్యప్రాజాపత్య
వ్యూహరశ్మీ౯ సమూహ తేజః
య త్తేరూపం కల్యాణతమం తత్తే పశ్యామి
యోసా వసౌ పురుషః సోహ మస్మి
స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః॥"
ధ్యేయ స్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః
కేయూరవా౯ మకరకుండలవా౯ కిరీటీ
హారీ హిరణ్మయవపుః ధృతశంఖ చక్రః॥
ఆదిత్యమండలే ధ్యాయే, త్పరమాత్మాన మవ్యయమ్
విష్ణుం చతుర్భుజం రక్తపంకజాసన మధ్యగమ్
కిరీట హారకేయూర కటకాది విభూషితమ్
శ్రీవత్స వనమాలాశ్రీ, తులసీకౌస్తుభోజ్జ్వలమ్
హరిం పీతాంబరధరం, శంఖచక్రగదా ధరమ్॥
ప్రసన్నవదనం రత్న, కుండలై ర్మండితాననమ్
సర్వరత్న సమాయుక్త, సర్వాభరణ భూషితమ్
అర్కమండల మధ్యస్థం, సూర్యకోటి సమప్రభమ్
బ్రహ్మాది సేవ్యపాదాబ్జ, న్నౌమి బ్రహ్మరమాసఖమ్॥

ఇత్యాద్యనేక ప్రమాణ వాక్యములుగలవు ఇట్టి వానిని దనయందుఁ జూచువారికి శాశ్వత సుఖముకలదుగాని యితరులకు లేదు.

శ్లో. త మాత్మస్థం యేను పశ్యంతి ధీరాః
తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్॥

## ఆత్మావలోకనమున కధికారి యెవఁడు?

ఈ విధముగ మీఁదఁ జెప్పిన మూర్తిని యోగులు హృదయమందుఁ జూతురు. భక్తులు దేవాలయమునందుఁ జూతురు. మొదటిది యోగమార్గము. రెండవది భక్తిమార్గము. మొదటి మూర్తి భగవత్స్వం కల్పితము. రెండవది భక్తాభీష్టము. భేద మింతమాత్రమే కాని తక్కిన యే విషయమునందును భేదము లేదు. హృదయమందలి భగవంతు సాక్షాత్కరింపఁ జేసికొనుట కేది యుపాయమో దేవాలయమందలి భగవంతు సాక్షాత్కరింపఁ జేసికొన నదియే యుపాయము. దాని కేమి ఫలమో దీనికా ఫలమే. తొలుతఁ దనయందు భగవంతు సాక్షాత్కరింపఁ జేసికొను టెట్లో చూతము.

శ్లో. నాయ మాత్మా ప్రవచనేన లభ్యో,
న మేధయా న బహునా శ్రుతేన
య మేవైషవృణుతే తేన లభ్య,
స్తస్యైషఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥
నాయ మాత్మా బలహీనేన లభ్యో,
న చ ప్రమాదా త్తపసోవా ప్యలింగాత్
ఏతై రుపాయై ర్యతతే యస్తు విద్వాం,
స్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ ॥
నైవ వాచా న మనసా, ప్రాప్తుం శక్యో న చక్షుషా

అస్తీతి బ్రువతో న్యత్ర, కథం తదుపలభ్యతే॥
అస్తీత్యేవోపలబ్ధవ్యః, సతత్వభావేన చోభయోః
అస్తీత్యేవోపలబ్ధస్య, తత్త్వభావః ప్రసీదతి. ౬౫॥

ఈ యాత్మ వేదముల నధ్యయనము చేయుటచేఁగాని విశేష చమత్కార వాక్యములచేఁగాని లభింపదు, బుద్ధిబలము చేతను లభింపదు విశేష శ్రవణమువలనను లభింపదు; ఎవని నిది వరించునో వానికిది లభించును; వానికే యీ యాత్మ తన స్వరూపమును వివరముగ విశద పఱుచును. అనఁగా భగవదను గ్రహమువలన నాత్మ సాక్షాత్కరింప వలయునుగాని మనశక్తి సామర్థ్యములచే సాక్షాత్కరింపదు. ఎవరాత్మను ప్రీతితో వరింతురో వారినే యాత్మయువరించును.

ఈయాత్మ బలహీనునకు (దేహారోగ్యము, మనోబలము, పట్టుదల లేనివానికి) లభింపదు. హెచ్చరిక తప్పియుండు వానికి సోమరికి లభింపదు. అక్రమవిధమునఁ దపస్సుచేయు వానికి లభింపదు. "నలింగం ధర్మకారణ" మ్మని యుండుటచే బాహ్యసన్న్యాస చిహ్నములు ముఖ్యములుగావు అంతరంగమున సన్న్యాసియై యుండవలయును. రెండునుండిన శ్రేష్ఠమే అంతరంగమున సన్న్యాసిగాక సన్న్యాసివేషము వేయఁగానే ప్రయోజనము లేదు. కర్మజ్ఞాన భక్తియోగములను నుపాయములచే నెవఁడు దృఢ ప్రయత్నముచేయునో యట్టి జ్ఞానియాత్మ బ్రహ్మధామమునఁ బ్రవేశించును. వాక్కుచే నిది పొందుటకు సాధ్యపడదు. మనస్సు చేతను సాధ్యపడదు. కన్నులచేతను

సాధ్యపడదు. 'కలదు' అని యెవఁడు శ్రద్ధతోఁ జెప్పునో వానికి లభించును. అంతియకాని మఱియొక విధముగ నది యెట్లు లభించును? శ్రద్ధలేనివానికి నాస్తికునకు నాత్మసాక్షాత్కరింపదు.

శ్లో. నాహం వేదై ర్న తపసా, న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం, దృష్టవానసి మాం యథా
భక్త్యా త్వనన్యయా శక్య, అహ మేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన, ప్రవేష్టుం చ పరంతప.
భగ. ౧౧. ౫౩-౫౪.

ద్వి. తపముల శ్రుతులను దానయజ్ఞముల
నిపుణులైనను నన్ను నీచూచినట్టి
యీయాకృతినిఁ జూడనసమర్థులయ్య
ఏయితరులయందు నేగనిభక్తిఁ
దెలియంగఁగలవాఁడు దిలకింపఁజొరఁగ
జలజారివంశ్య నేశక్యుండనగుదు. ద్వి. భ.

శ్లో. వేదాంతే పరమం గుహ్యం, పురాకల్పే ప్రచోదితమ్
నాప్రశాంతాయ దాతవ్యం, నాపుత్రా యాశిష్యాయః
యస్య దేవే పరాభక్తి, ర్యస్య దేవే తథా గురౌ
తస్యైతే కథితా హ్యర్థాః, ప్రకాశంతే మహాత్మనః
తపః ప్రభావా ద్దేవప్రసాదాచ్చ,
బ్రహ్మహ శ్వేతాశ్వతరోథ విద్వాన్

అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రం
ప్రోవాచ సమ్య గృషిసంఘజుష్టమ్॥ శ్వేతా.

వేదాంతమునందు మిగుల రహస్యమై పూర్వకల్పమున నాచరింపఁబడుచుండిన దీనిని జిత్తశుద్ధిలేనివానికిని మిగుల శాంతచిత్తుఁడైన పుత్త్రుఁడుగాని వానికిని, యట్టి గుణములుగల శిష్యుఁడు గాని వానికిని జెప్పరాదు.

ఎవనికి దేవునియందు, దేవునందువలె గురువునందును బరభక్తి గలదో యట్టి మహాత్మునకే యీవిషయములు సాక్షాత్కారమొందును. తపఃప్రభావముచేతను, దైవానుగ్రహముచేతను, బ్రహ్మజ్ఞానముగల శ్వేతాశ్వతరుఁ డాశ్రమములందు శ్రేష్ఠులగు వారికిఁ బరమపవిత్రమై ఋషిసమూహముచే సేవితమైన యీ బ్రహ్మజ్ఞానమును బూర్ణముగ విశదీకరించెను. (ఇచ్చటఁ దపస్సనఁగా నుపవాసాది వ్రతములు. నిత్య కర్మానుష్ఠానములు. ఏకాగ్రచిత్తము.)

దీనివలనఁ జిత్తశుద్ధి, శాంతి, గురుభక్తి, దైవభక్తి గలవానికిఁ గాని బ్రహ్మజ్ఞానము లభింపదు. ఇన్ని యుండినను దైవానుగ్రహముండవలయును. అది కలుగు వఱకు నన్నియుఁ జేయుచుండ వలసినవియే. వీనికన్నిటికి నెవరు యోగ్యులు? ఉత్తమాశ్రమ ధర్మనుండుండు వారు.

వాస్తవమిట్లుండ నీ కాలమున ౦-౪-౦ లకు భగవద్గీత పుస్తకముగొని జేబులో నుంచుకొని తిరుగువారందఱు బ్రహ్మవేత్తలే తిష్ఠన్మాత్రులందఱు బ్రహ్మజ్ఞానోపదేశకులే. అనాచా

వులు దురాచారులు కదర్యులందఱు గీతాచార్యులే భగవద్గీతా శ్లోకములు నాలుగు నోటికివచ్చినవారు బ్రహ్మనిష్ఠులే. కాలమహిమ.

ఆత్మసాక్షాత్కారము గోరువానికి మఱియుఁ గొన్ని గుణములు కావలసియున్నవి.

శ్లో. సత్యేన లభ్యః తపసా హ్యేష ఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్
అంతశ్శరీరే జ్యోతిర్మయోహి శుభ్రో
యం పశ్యంతి యతయః క్షీణదోషాః ॥ ముండక ॥

సత్యముచేతను, దపస్సుచేతను, బూర్ణజ్ఞానముచేతను, నిత్యము బ్రహ్మచర్య మవలంబించుటచేతను, నీయాత్మ సాక్షాత్కరించును.

దేహము లోపల జ్యోతిర్మయుఁడై, శుభ్రుఁడై యుండు నెవనిని యతులు చూతురో వారు క్షీణదోషులు.

శ్లో. మచ్చిత్తా మద్గతప్రాణాః, బోధయంతః పరస్పరం
కథయంతశ్చ మాం నిత్యం, తుష్యంతిచ రమంతిచ
తేషాం సతతయుక్తానాం, భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం, యేన మా ముపయాంతి తే.
భగ. ౧౦-౧౦.

నాయందే మనస్సునిలిపి, ప్రాణములు నాయందేనిలిపి, పరస్పరము బోధించుకొనుచు నన్ను గుఱించి నాకథలు చెప్పుకొనుచు సర్వదా దానితోనే సంతుష్టులై యదియే వినోద

క్రీడగాఁ గలవారెవ్వరో యట్లు సతతయోగయుక్తులై ప్రీతి పూర్వకముగ భజించువారికి యెట్టి బుద్ధిబలము లభించిన నన్నుఁ బొందుదురో యట్టి బుద్ధిబలమును నేనే యిచ్చు చున్నాను. అని శ్రీకృష్ణుఁడు చెప్పెను.

కావున భగవత్ప్రాప్తి కావలయునను బుద్ధియు భగవద్భక్తమే ఎట్టివారికి సర్వకాల సర్వావస్థలయందు భగవంతునిపై మనస్సుంచి, ప్రాణము లాయనకే ధారవోసి, భగవద్విషయమే యొకరికిఁ జెప్పుచు నొకరు చెప్పఁగా వినుచు నా విషయమైన ప్రసంగములే చేయుచు నదియే వినోద క్రీడగాఁగలిగి దాని చేతనే సంతోషపడుచు సర్వకాల సర్వావస్థల యోగయుక్తులై ప్రీతి పూర్వకముగ భజియించువారికి దత్ప్రాప్తియగుఁగాని యితరులకుఁగాదు. ఇతరులకేల కాదు?

త్రిభిర్గుణమయై ర్భావై, రేభిః సర్వ మిదం జగత్
మోహితం నాభిజానాతి, మా మేభ్యః పర మవ్యయమ్॥

శ్లో. దైవీ హ్యేషా గుణమయీ, మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంతే, మాయా మేతాం తరంతి తే॥

భగ. ౭-౧౪.

ద్వి భువనంబులన్నియు మూఁడు గుణముల, మొనయు భావము లచే మోహంబుచెంది కనుఁగొనఁగా వీనికంటెను ఘనుఁడు, నవ్యయుఁడగు నన్ను నాత్మనింతేని నవ్యసాచి యెఱుఁగఁజాలకున్నవియు.

ద్వి. త్రిగుణాత్మకంబును దేవసంబంధి యగు నాదుమాయ శక్యము
గాదు దాఁట, లేరు నన్నే యాశ్రయించు చున్నారో, వారు
మాత్రమె దాఁటువారలీమాయ

ఈ వాక్యముల సారాంశ మేమన:—వేదాధ్యయనము,
బుద్ధిబలము, బహుగ్రంథపఠనము, వాక్చమత్కృతి, దాతృత్వము,
యజ్ఞాచరణము లోనగువానిచే నాత్మ సాక్షాత్కారము గలు
గదు. బలహీనులకుఁ బ్రమత్తులకు, నశాస్త్రీయవిధమునఁ దపస్సు
చేయువారికిని నాత్మసాక్షాత్కారము కలుగదు. సత్యము, తపస్సు,
జ్ఞానము, బ్రహ్మచర్యము, శాంతి, చిత్తశుద్ధి, గురుభక్తి, దైవభక్తి
యివి గలవారికి నాత్మసాక్షాత్కారము గలుగును. ఇన్ని యుండి
నను దైవానుగ్రహము లేక లభింపదు. దైవ మెవరి ననుగ్రహింపఁ
దలఁచునో వారికి తాను సాక్షాత్కరించును. తనయందుఁ
బ్రీతిగలవారినే దైవము గ్రహించునుగాని తనయందుఁ బ్రీతి
లేనివారి ననుగ్రహింపఁడు. ఇది లోక మర్యాదయందును గాన
నగు. భగవంతునియందలి ప్రీతికే భక్తియనిపేరు. భక్తిగలవానికి
మాత్రమే తనరూపు గనఁబడఁ జేయుదునని భగవంతుఁడే
యర్జునునకు విశ్వరూప దర్శన సందర్భమునఁ జెప్పెఁగదా.

శ్లో. నాహం వేదై ర్నతపసా, న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం, దృష్టవానసి మాం యథా
భక్త్యా త్వనన్యయా శక్య, అహ మేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన, ప్రవేష్టుం చ పరంతప॥ ౧౧-౫౩-౫౪

ద్వి. తపముల శ్రుతులను దాన యజ్ఞముల, నిపుణులైనను నన్ను
నీ చూచినట్టి । యీయాకృతిని జూడన సమర్థులయ్య! యే
యితరులయందు నేగని భక్తిఁ । దెలియంగఁ, గలయాపుఁ
దిలకింపఁ; జొరఁగ, జలజారివంశ్యనే శక్యుండనగుదు ॥

దీనివలనఁ దక్కిన మార్గములకు భక్తిమార్గమునకుఁ గల తారతమ్యము స్పష్టపడియె.

భారతరణవేళ భగవంతుఁ డర్జునునకు దర్శనమిచ్చినది హృదయమునఁగాదు. దేవకీవసుదేవులకుఁ గారాగృహమందు దర్శన మనుగ్రహించినది హృదయమందుఁగాదు. ఇట్టివి పెక్కు లున్నవి. హృదయమందు దర్శింపఁగలుగుటకును బాహ్యమందు దర్శింపఁగలుగుటకును ముఖ్యసాధనము భక్తి. భక్తిలేని జ్ఞానకర్మ వాచాకౌశలంబులు వ్యర్థంబులు. హృదయమందు దర్శించుటకు జ్ఞానికే గుణము లవశ్యకములో యవే బాహ్యసాక్షాత్కారము గోరు భక్తునకు నావశ్యకములు. యోగికి హృదయమందు భగవంతుఁడు గోచరించును. భక్తునకు బాహ్యమందు గోచరించును. భగవద్గీత ౧౨-వ యధ్యాయము చూడుఁడు.

శ్లో. యేతు సర్వాణి కర్మాణి, మయి సంనస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన, మాం ధ్యాయంత ఉపాసతే
తేషా మహం సముద్ధర్తా, మృత్యుసంసారసాగరాత్
భవామి నచిరా త్పార్థ, మయ్యా వేశితచేతసామ్
మయ్యేవ మన ఆధత్స్వ, మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ, అత ఊర్ధ్వం న సంశయః.

ద్వి.అన్ని కర్మముల నాయందు నయునిచి, నన్నె పరుఁడుగన నన్య యోగమున। నన్ను ధ్యానించుచు నన్ను పాసించు, చున్నా రో వారలనోపి నాయందు। మనసుంచువారిని మరణంబు తోడ, మొనయు సంసారసముద్రమునుండి। చెచ్చెరఁ దరి యింపఁ జేయుదుఁబార్థ, నిచ్చలునాయందె నిలుపుమనంబు నాయందెనిలుపు మనయమునుబుద్ధిఁ, బాయక యిఁకమీఁ దఁబార్థ నాయందె।నిలుపంగఁగలవిది నిక్కంబునుమ్ము, వలదు సందేహంబు వాసవతనయ.

ఈ వాక్యములయందు.

అంతశ్శరీరే జ్యోతిర్మయోహి శుభ్రో
యంపశ్యంతి యతయః క్షీణదోషాః॥
తమాత్మస్థం యేనుపశ్యంతి ధీరాః
తేషాంసుఖం శాశ్వతం నేతరేషామ్.

ఇత్యాది వాక్యముల యర్థముగాన రాకుండుట పాఠకులు గమనింతురుగాక. నాయందు నాయందునని చక్షువులకు గోచరించు తన్ను గుఱించి చెప్పెనుగాని చక్షువులకు గోచరింపని వానిని జెప్పలేదు. కావున నే

శ్లో.అథ చిత్తం సమాధాతుం, న శక్నోషి మయిస్థిరమ్
అభ్యాసయోగేన తతో, మా మిచ్ఛాప్తుం ధనంజయ॥
అభ్యాసే ప్యసమర్థోసి, మత్కర్మపరమో భవ
మదర్థ మపి కర్మాణి, కుర్వ౯ సిద్ధి మవాప్స్యసి॥

అథై తదప్యశక్తోసి, కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మ ఫలత్యాగం, తతః కురు యతాత్మవాన్. ౧౨.౧౧

ద్వి. స్థిరముగ నాయందుఁ జిత్తంబునిలుప, సరగనునిఁక నీకు శక్తి లేదేని! యటమీఁదఁగోరు మాయభ్యాసయోగ, పటిమ చేనైనను బ్రాపింపనన్ను! అలవికాదేనియు నభ్యాసమైనఁ, జలువుము నాకర్మచయమె ముఖ్యముగ! నాకై చేసినను గర్మములను, బ్రాకటంబుగ సిద్ధిఁ బ్రాపింపఁగలవు! ఇఁక దీనిఁ జేయలేవేని నాయోగ, మకలంకమతి నాశ్రయంబును బొంది యటమీఁద నియమించి యంతఃకరణము, పటుకర్మ ఫల కాంక్షనవలు మంతయును.

అని భగవంతుఁడు నాలుగుపాయములఁ జెప్పెను.

౧. సర్వకాల సర్వావస్థలయందుఁ దైలధారవలె భగవంతునియందు మనస్సుంచుట

౨. దాని కధికారి కానివాఁడు దాని నభ్యసించుట. ఒక క్షణము మఱచినను వెంటనే జ్ఞప్తికిఁ దెచ్చుకొని ధ్యానించుట.

౩. దానికి నధికారి కానివాఁడు భగవత్కార్యములు దేవాలయ నిర్మాణము తులసీ పుష్పోద్యాన నిర్మాణము దేవాలయమలుకుట ముగ్గులు పెట్టుట దేవునిపల్లకీలు వాహనములు మోయుట ఛత్ర చామరాదులుపట్టుట పూలదండలు తులసీ మాలలు కట్టుట దీపారాధనములోనైనవి చేసినను మోక్షము కలదు. ఇవియును భక్తితోఁ జేయవలయునుగాని యిప్పుడు దేవాలయ వాహనములు చేయునట్లు చేయరాదు.

౭. ఇట్లు చేయుటకు సాధ్యపడనివారు తాముచేయు సమస్తకార్యములు కృష్ణార్పణమని రామార్పణమని చేయువల యును. ఇట్లు చేయుటచేతను మోక్షముగలదు. ఎట్లన—

శ్లో. యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ, తత్కురుష్వ మదర్పణమ్
శుభాశుభఫలై రేవం, మోక్ష్యసే కర్మబంధనైః
సన్యాస యోగయుక్తాత్మా, విముక్తో మా ముపైష్యసి॥
౯-౨౭-౨౮.

ద్వి. ఏదేది చేసెదో యేదేది తినెదో, యేదేది వేల్చెదో యేది
యిచ్చెదవో। యెదియెదితపమని యొలమిఁ జేసెదవో, యది
యెల్లనాకుఁగా నర్పింపవయ్య। ఆ విధంబుగను సన్యాస
యోగంబు, భావించి యాత్మశుభం బశుభంబు। ఫలముగా
గల కర్మబంధాళిచేత, వలనుగ విడువంగఁబడి నను(గనుదు.

ఈ పుణ్యపాప విముక్తియే ముక్తి హేతువనియు హృదయ మందు నాత్మసాక్షాత్కారమువలనఁ గలుగు ఫల మిదియేయని యు శ్రుతులును ఘోషించుచున్నవి. యదాపశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం। తదావిద్వాన్ పుణ్యపాపేవిధూయ నిరంజనః పరమం సామ్యముపైతి ॥ ఇది మీఁద నుదాహరింపఁబడినది.

సర్వకర్మఫలత్యాగమునకు నాత్మసాక్షాత్కారమునకు ఫల మొక్కటియే యైనపుడు మిక్కిలి గాసిపడి సాధించు రెండవ దానికంటె సుకరమైన మొదటి దెట్లు తక్కువ కాఁగలదు? దాని

నాచరించువాఁడు మందుఁ డెట్లగును? వీఁడే మందుఁడు కాఁ డేని వీనికిఁ బైమెట్టున నుండువాఁడు భగవత్కార్యములనే చేయువాఁడు మందుఁ డెట్లగును? కావున దాసోహమ్మని భగవత్కైంకర్యములు చేయువాఁడు మతిహీనుఁ డనుకొనువాఁడే మతిహీనుఁడు.

సన్న్యాసియై కర్మములు చాలించుకొనుట శ్రేష్ఠమా కర్మములు చేయుట శ్రేష్ఠమా యని యర్జునుఁడు.

శ్లో. జ్యాయసీ చేత్కర్మణ స్తే, మతా బుద్ధి ర్జనార్దన
తత్కిం కర్మణి ఘోరే మాం, నియోజయసి కేశవ. భగ. 3-౧.

ద్వి. మానాయకా! కర్మమార్గంబుకంటె, జ్ఞానమార్గంబె శ్రేష్ఠం
బని నీదు। మతమేని ఘోరకర్మంబులొనర్ప, క్షితిధరా నను
నియోగించెద వేల?

యని యడుగఁగా శ్రీకృష్ణభగవానులు.

శ్లో. న కర్మణా మనారంభా, న్నైష్కర్మ్యం పురుషోశ్నుతే
న చ సన్న్యసనాదేవ సిద్ధిం, సమధిగచ్ఛతి. భగ. 3-౪.
నియతం కురు కర్మత్వం, కర్మజ్యాయో హ్యకర్మణః. భగ. 3-౮
సన్న్యాసః కర్మయోగశ్చ, నిఃశ్రేయసకరా వుభౌ
తయోస్తు కర్మసన్న్యాసా, త్కర్మయోగో విశిష్యతే.
భగ. ౫-౨.

ద్వి. కర్మంబు వదలఁగల్గదు జ్ఞాననిష్ఠ, కర్మసంచ్యుతి మాత్రఁగలు
గదుసిద్ధి। మానక నియతకర్మము లీవుసలుపు, కర్మంబు శ్రేష్ఠము
కర్మంబుకంటె। కనఁగ సన్న్యాసంబు కర్మయోగంబు, లను

రెండుఁ గలిగించునయ్యా మోక్షంబు। ఆరెంటఁగర్మ సన్న్యా
సంబుకంటె, గౌరవంబునుగాంచుఁ గర్మయోగంబె.

యోగ సన్న్యాసములు మేలా భక్తిమార్గము మేలా యను విషయమున యోగీశ్వరుఁడై కలియుగాంతమున యోగమును బునరుజ్జీవింపఁ జేయఁగాచి వేచియుండు నుద్ధవుఁడేమి చెప్పెనో చూతము.

"నీవు భోగించి విడిచిన మాల్యాలంకార భోజనాదుల దాసులమైన మేమనుభవించి నీమాయను నిజంబుగఁ దరింతుము. దానికై ప్రత్యేక ప్రయత్నం బనావశ్యకంబు దిగంబరులుఁ, గౌపీన మాత్రధారులు, నుపవాస వ్రతకర్శితులు, నూర్ధ్వరేతస్కులు రాగద్వేష వియుక్తులు, పాప విరహితులు, సన్న్యాసులు బ్రహ్మలోకంబునకుఁ జనుదురుగాక. మేమో కర్మమార్గ ప్రమత్తులమై నరలోక విడంబనార్థంబు నీవు కావించిన కార్యములు, పలికిన పలుకులు, నడకలు, నవ్వులు, చూపులు స్మరించుచు స్మరింపఁ జేయుచున నాయాసంబుగఁ దమంబతిక్రమింతుము" ౨౧-౩ శ్లో

మఱియును, శ్రీకృష్ణ లీలామృతంబున 1015-1002 పుటలు చూడుఁడు.

## పూజాభేదములు

పూజా విధానములు మూఁడు విధములు. మానసపూజ, హోమపూజ, బేరపూజ. భగవంతుఁడు భక్తసులభుఁడు, దానికి వశుఁడైనట్లు దేనికిని వశుఁడుగాఁడు, ప్రహ్లాదుని

వాక్యములు స్మరింపుఁడు, భక్తి ప్రీతివలనఁ గలుగును. ఒక పదార్థమునందుఁ బ్రీతిగలుగుటకుఁ బ్రథమకారణములు కన్నులు. వానిమూలమున మనస్సునకు హృదయమునకుఁ బ్రీతి కలుగును. వీని వెనుకటివి చెవులు కనుకనే కన్నులుముందు చెవులు వెనుక నుండునట్లు భగవంతుఁడు సృష్టించెను. కావునఁ గన్నులకు మనస్సునకు హృదయమునకుఁ బ్రీతికలిగించుటకును, బ్రీతికొలఁది పుష్పాదులఁ బూజించుటకును, నిష్టమువచ్చినట్టు ప్రేమకొలఁది కౌఁగిలింపను ముద్దుపెట్టుకొనను, బిడ్డవలె లాలింపను, దండ్రివలెఁ బూజింపను, స్వామివలె సేవింపను సాధ్యపడునుగావునఁ దక్కిన రెంటికంటె బేరపూజ యేశ్రేష్ఠమని శాస్త్రము చెప్పుచున్నది.

శ్లో. మానసీ హోమపూజాచ, బేరపూజేతి సాత్రిధా
యథోపయోగ శక్యత్వా, త్కర్తుం పుష్పాదిపూజనమ్
చక్షుషః ప్రీతికరతా, న్మనసో హృదయస్యచ
ప్రీత్యాసంజాయతే భక్తి, ర్భక్తస్య సులభోహరిః
తస్మాత్రయాణా మేతేషాం, బేరపూజా విశిష్యతే-వైఖానస.

భగవద్గీతయం దెందును గర్తస్వరూప త్యాగముగాని సన్న్యాసాశ్రమ స్వీకారముగాని కర్తవ్యమని చెప్పఁబడలేదు. అహంకర్తృత్వాభిమానము-ఫలాపేక్ష-నిజస్వాతంత్ర్యము త్యాజ్యములని చెప్పఁబడినవి. కలియుగమున నీకాలమున సన్న్యాసాశ్రమ స్వీకారము సర్వధా నిషిద్ధము.

దేశము కాలము నాలోచించి ఋషులు సన్న్యాసమ యుగమునకు నిషేధించియుండ దానిని బాటింపక బుద్ధాదులు దేశమునిండ సన్న్యాసులను సన్న్యాసినులగు వెల్లివిరియఁ జేయుటచే దేశము సోమరులచేతను దుర్బలులచేతను భక్తిహీనులచేతను నిండి యిట్టిదశకు వచ్చినది. అటుగాక వారివారి కులాచార పద్ధతులను సరించి కర్మములుచేయుచు భక్తియుక్తులై భగవంతుని నమ్మియుండిన నిట్టి యధమదశకు రాకయుండును.

దేహమునందు నాత్మను సాక్షాత్కరించుకొనుట కేది యుపాయమో దేవాలయమునందుండు భగవంతుని సాక్షాత్కరింపఁ జేసికొనుట కదియే యుపాయము. దాని కెవ్వఁ డెవ్వఁ డధికారియో దీనికి నట్టివాఁడే యధికారి. దాని కేది ఫలమో దీనికి నదియేఫలము. అధ్యవసాయము మాత్రము భేదము. అది పూర్వజన్మ వాసనాబలమునఁ గలుగునది. ఐన మొదటిది దుష్కరము. రెండవది సుకరము. ఇది సిద్ధాంతము.

ఇఁక దేహమునకు దేవాలయమునకుఁ దత్త్వమునఁ బోలికగలదే మో చూచెదము. భక్తిమార్గనిష్ఠులకు దేవాలయములనియు భక్తులైన నారదాదులకు భగవంతుఁ డీమార్గ ముపదేశించెననియు ముందే చెప్పితిని. కావున బోలికల నాలోచించునపుడును భక్తిమతశాస్త్రముల ననుసరించియే చెప్పవలసి యుండును.

## దేహమందలి తత్త్వము.

దేహమున మూఁడుతత్త్వములు గలవు. ప్రకృతిపరిణామమైన దేహము జీవాత్మ పరమాత్మ. ఈవిషయమును,

ద్వా సుపర్ణా సయుజా సఖాయా, సమానం వృక్షం పరిష స్వజాతే। తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్య శ్నన్నన్యో అభిచాకశీతి॥ సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః। జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్యమహిమాన మితి వీతశోకః॥ అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః.

మంచిఱెక్కలు, స్నేహముగలిగి కూడి సమానములై యుండు రెండుపక్షు (జీవాత్మపరమాత్మ) లొకచెట్టు (దేహము) నందున్నవి. అందొక్కటి (జీవాత్మ) దాని తియ్యనిపండ్లను (కర్మఫల) మనుభవించును. రెండవది (పరమాత్మ) యనుభవింపక ప్రకాశించును. ఒక్కచెట్టునందే పురుషుఁడు (జీవుఁడు) దిక్కు లేకసంసారమున మునిఁగి శోకించుచున్నాఁడు. ఎప్పు డీశ్వరుని సేవ్యుని మహిమగలవానిని (పరమాత్మను) జూచునో యప్పుడు శోకము మానును. అంగుష్ఠపరిమాణముగల పురుషుఁడు పొగ లేని జ్యోతివంటివాఁడు.

ఇత్యాది పరశ్రుతిప్రమాణములచే నీవిషయము సిద్ధాంతితమై యుండుటచే నేనా శ్రమముపడఁ దలఁప లేదు. దేహమునఁ గల మూఁడుతత్త్వములవలెనే దేవాలయమున మూఁడు తత్త్వములుగలవు. శిలామయమైనగుడి. గర్భగృహమున నఖండ దీపము. భగవన్మూర్తి.

శరీరస్థానమునఁ బ్రాకారము. ప్ర + ఆ కారమను శబ్దమే దేహమునకుఁ బోలికగలదని తెలుపుచున్నది. జీవస్థానమున

ండదీపము. ఇది యఖండదీపమఁట. ఇది యాఱిపోరాదు. ముమునుండి జీవుఁడు వెడలిపోయెనేని యది యెట్లు పరిశుద్ధ నో యట్లే యఖండదీప మాఱిన దేవాలయమని తలఁప యును. కావున నే యఖండదీప మాఱెనేని పునస్సంప్రోక్ష కావలయును. జీవుఁ డెట్ల చ్ఛేద్యుఁడో యట్లది యఖం . జీవుఁ డెట్లు జ్యోతిస్స్వరూపుఁడో యట్లే యదియు. త్త యేకదా పరమాత్మ. వేఱు వేఱుగాఁ జెప్ప నెట్లగుం గాం.

మమైవాంశో జీవలోకే, జీవభూతస్సనాతనః. భగవ ౧౫-౭

అని జీవుఁడు తనయంశమునియే శ్రీకృష్ణుఁడు చెప్పెను. త్తేశ్వరంగ''మ్మన్నట్లు జీవునకు నియంతయై యుండువాఁడు భగ వుఁడు. యఆత్మనితిష్ఠన్నాత్మ నోన్తరో యమాత్మానవేద స్యాత్మాశరీరమ్ యఆత్మానమన్తరో యమయితి సతఆత్మాన్త మ్యమృతః॥ శ్రుతి.

''అహమాత్మాగుడాకేశసర్వభూతా శయస్థిత'' భగ. ౧ ట ఆత్మజీవాత్మ యందు లేని విభూతిగా గ్రహింపవలసియుం . ''ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి'' యను ని ననుసరించి యీశ్వరుఁడనినచో సాకారుఁగా గ్రహింప సియుండును. గర్భగృహమే హృదయగుహ. గర్భగృహ న గాలివచ్చుచుండవలయునని నవనాగరకులు కిటికీలు తప్పు. పద్మకోశ ప్రతీకాశంహృదయం చాప్యధోముఖ ట్లు కొనమీఁదివైపు త్రిప్పిన తామరమొగ్గయందుండు

నాత్మ యున్నట్లే ధ్యానింపవలయును. గనుక విమాన మట్టులే కట్టఁబడియుండును.

యదాత్మతత్త్వేన తు బ్రహ్మతత్త్వం దీపోపమేనేహ యుక్తః ప్రపశ్యేత్ ॥ ఆత్మజ్యోతిచేఁ బరమాత్మను దర్శించునట్లే యఖండ దీపకాంతిచే భగవన్మూర్తిని దర్శింపవలయును,

శ్లో. ప్రణవో ధను శ్శరో హ్యాత్మా, బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం, శరవ త్తన్మయో భవేత్.

అని ప్రణవోచ్చారణ పూర్వకముగఁ దదర్థసంధానము చేయుచు జీవాత్మను బరమాత్మను జేర్పవలయును. అట్టులే ప్రణవోచ్చారణ స్థానంబున ఘంటానాదము ఘంటాధ్వని ఓమ్మని యుండవలయుననుటకు నిదే కారణము ఈ ధ్వని వికార ధ్వని గలదై యుండరాదు. ఓంకార శ్రవణము భూత ప్రేత పిశాచాదుల నెల్ల నెట్లు పాఱఁదోలునో యట్లే సుస్వరముగల ఘంటానాదమును. ఈ ఘంటానాదము దేవతాకార్యములందే వినియోగము. అశుభ కార్యములఁ గారాదు. కావుననే శ్రాద్ధాదుల ఘంటానాదము నిషిద్ధము.

శ్లో. ఉత్సాదనం పిశాచాదేః, ప్రీణనంచ హరేఃపరం
సన్నిధాన మమర్త్యానాం, ఘంటాయాశ్చాల నాద్భవేత్.
పాద్మ.

'యవనికా మాయా జగన్మోహినీ' యన్నట్లు మూర్తుల కుందు తెఱవైచి యుందురు.

గృహామునకు ముందుండు చీఁకటి ‘తమసః పరస్తా
మును స్ఫురింపఁ జేయును.

త్తేనా ప్రపన్నస్య, విష్ణుమే కాంతినస్త థా
రాంతి లంఘనా దీని నకుర్యాచ్ఛసతాం సదా ॥

ంటు చే భక్తుల నీడను ద్రొక్క రానట్లు దాఁట రా
యము న విమానచ్ఛాయను ద్రొక్కి పోరాదు.
దేనిని దాఁటి పోరాదు.

ఃః పరమాత్మాతు, దేహంతే వ్యాప్యతిష్ఠతే
హం జ్ఞానవిజ్ఞేయం, నావమన్యే నలంఘయే ॥
గ్వగమైర్న విద్యాంచ, తమహం భూతభావనమ్
యం త్వాంగిరించైవ, హనుమానివ సాగరమ్

భార. ౧౪౯ అధ్యా.

డైన పరమాత్మ నీ దేహమందంతయు వ్యాపించి
జ్ఞానమువలన నట్టివానిని దెలిసిననే నాయనను న
దాఁటరాదు. ఆగమములచే దీనినే నెఱుఁగక
హానుమంతుఁడు సముద్రమును దాఁటినట్లు నిన్ను
దాఁటిపోనా?

భీముఁడు హానుమంతునితోఁ జెప్పినట్లు జీవజంతువు
పోరాదో యట్లు ‘నాంతరాబలి పీఠయో’ యని
ర్తికి బలిపీఠమునకు నడుమఁ బోరాదు. శివాలయ
ంది శివులకు నడుమఁ బోరాదు. ‘అలంకార ప్రి
వ న్నట్లు సూర్యమండలమందును హృదయకముల

మందును నుండు విష్ణుమూర్తి యలంకార యుక్తుఁడై యుండుట
విష్ణుమూర్తి నలంకరింతురు. 'అభిషేక ప్రియశ్శివ' యన్న
గంగాధరు నభిషేకింతురు. అంతియకాదు యోగి యభ్యా
కాలంబున 'ఆత్మానం యుంజీత' 'శరవత్తన్మయోభవే' య
నట్లు తన్నుఁ బరమాత్మతోఁ జేర్చుకాలమున దేహి దేహాన
డుట యెట్లెఱుంగక పోవునో యట్లే మంత్రములచేఁ బం
పనిషన్మయ దేహముగలిగిన యర్చారూపములఁ బూజిం
నపుడు నర్చకుఁడును దత్సమానస్థితి యందుండినఁగాని యర్చ
చేయ యోగ్యత లేమిం జేసి పంచోపనిషన్మంత్రములచే దేహ
నందలి పంచభూతములను బంచతన్మాత్రలతోడ మనోహంకా
మహత్తత్త్వ ప్రకృతులను లయింపఁజేసి "తమః పరమాత్మనే
భావయామి" యని తత్త్వసంహారంబుఁగావించి యానల మం
ములచే శరీరమును శోషయామి దాహయామి యని శోషిం
జేసి దహింపఁజేసి యాత్మను భగవద్దక్షిణ పాదాంగుష్ఠ
క్రిందఁబ్రవేశింపఁజేసి యిట్లు కొంత కార్యము జరపి మర
బంచోపనిషన్మంత్రములచే నూతన పరిశుద్ధ శరీరముఁ గల్పిం
కొని యావలఁ బూజకుపక్రమించును. పూజావిధాన క్రమః
దాని తత్త్వముఁ జక్కఁగ నాలోచించితిమేని యోగి చేయునఁ
ర్యాగమునకు భక్తుఁడుచేయు బహిర్యాగమునకు భేదము లే
యోగికి ధ్యానసమయంబున నాత్మ సాక్షాత్కరింపదేని యష్ట
మానసిక పూజకంటె బాహ్యపూజయే శ్రేష్ఠమని చెప్ప
తప్పదు. అయినను బాహ్యపూజ చేయువారు ముంద

యథాశక్తి యంతర్యాగము సలిపియే బహిర్యాగముఁ గావింతురు. యాగమనఁగాఁ బూజ.

శ్లో. భగవన్ పుండరీకాక్ష! హృద్యాగంతుమ యాకృతమ్
ఆత్మసాత్కురు దేవేశ, బాహ్యేత్వాం సమ్యగర్చయే॥

' యని విన్నవించియే కదా గృహములందును నర్చకులు పూజ ప్రారంభింతురు.

మండల బ్రాహ్మణోపనిషత్తు నందలి యీ వాక్యము లీతత్త్వమును బోధించుచున్నవి కావున ననువదించెదను.

"తస్య నిశ్చింతా ధ్యానమ్। సర్వకర్తనిరాకరణ మావాహనమ్। నిశ్చయజ్ఞాన మాసనమ్। ఉన్మనీభావః పాద్యమ్।సదా మనస్క మర్ఘ్యమ్। సదాదీప్తిర పారామృతవృత్తి స్స్నానమ్। సర్వాత్మభావనా గంధః। దృక్స్వరూపావస్థాన మక్షతాః। చిదాప్తిః పుష్పః। చిదగ్నిస్వరూపం ధూపః। చిదాదిత్యస్వరూపం దీపమ్। పరిపూర్ణచంద్రామృతస్యైకీకరణం నైవేద్యమ్। నిశ్చలత్వం ప్రదక్షిణమ్। (దా) సోహంభావో నమస్కారః। మౌనం స్తుతిః। సర్వసంతోషో విసర్జనమితి। య ఏవం వేద.

శ్లో. యో యో యాం యాం తనుంభక్తః
శ్రద్ధయార్చితుమిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం, తా మేవ విదధా మ్యహమ్
స తయా శ్రద్ధయా యుక్తః, తస్యారాధన మీహతే
లభతే చ తతః కామాన్, మయైవ విహితాన్హితాన్.

భగ. ౭-౨౨.

పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి। తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః. భగ. ౯-౨౬.

ద్వి. మాన్యచరిత్ర యే మానవుఁడేని। యే యేశరీరంబు నెసఁగెడి
భక్తిఁ, బాయక శ్రద్ధతో భజియింపఁగోరు। నట్టట్టివానికి
నట్టట్టి శ్రద్ధ, దిట్టంబుగావింతు దృఢముగా నేను। శ్రద్ధచే నాతఁ
డారాధించెనేని, సిద్ధింపఁగా నేన చేయుదు హితము। లైన
యాతనికోర్కు లర్జునావింతె। ఆకులుఁ బూలుఁ బండైన
నీరైన, నాకు నెవ్వఁడిచ్చు నయముగభక్తి। దానిఁ బూతా
త్మక! తతభక్తినంబు, నైనదానిని బ్రీతి ననుభవించెదను.

విగ్రహారాధనము హేయమని తలఁచు వేదాంతిస్మన్యు
లను యోగింమన్యులను జూచినపుడాత్మ తెలియని యోగిక ద్వై
తములు మెండను వాక్యము స్మరణమునకు రాక తప్పదు.
ఏలన యోగియగు భర్తృహరి వైరాగ్యశతకమందు శివార్చనా
పద్ధతియందు వ్రాసిన.

శ్లో. స్నాత్వా గాంగైః పయోభి శ్శుచికుసుమఫలై రర్చయిత్వా
విభో త్వాం
ధ్యేయే ధ్యానం నివేశ్య క్షితిధరకుహరగ్రావపర్యంకమూలే
ఆత్మారామః ఫలాశీ గురువచనరతః త్వత్ప్రసాదాత్స్మరారే
దుఃఖం మోక్ష్యే కదా హం సమకరచరణే పుంసి సేవా
సముత్థమ్॥

యీ వాక్యమును జూచినయనంతర యగుపట్టును గేవల కౌపీనధారియైయుండియు భర్తృహరి శివపూజచేయుచున్నట్లు తేర్పడుచున్నది. వ్యాఖ్యాతయు "శుచిభిః శుద్ధైః శాస్త్రసమ్మతైరితియావత్ కుసుమైః ఫలైశ్చ త్వామర్చయిత్వా సమారాధ్యపి తేన బాహ్యపూజాయా అప్యంశతః ప్రాధాన్యమస్తీతి సూచితం" అనివ్రాసెను శిష్టాచారమిట్టిదై యుండ దీనిని దూషించు నేఁటికాలపు వారు యోగులుగారు జోగులు. నిజమైన యోగి దీని నెన్నఁడు నాక్షేపింపఁడు. కొందఱు సాధన దశయందు దీపములనో యితరపదార్థములనో పటములనో సహాయములుగ నుంచుకొందురు. ఇవి యన్నియు సహాయములైనచో విగ్రహము లేల కాఁగూడదు.

బ్రహ్మమొదలు స్తంబపర్యంతముగల ప్రతిపదార్థమందును నేదియో యొక విధమైన శక్తిగలదుగాని వ్యర్థమైన దేదియు లేదు. పదార్థముల దశాభేదము చేతను నితరవస్తువులతోడి సంయోగ వియోగములవలనను నీ శక్తులు వృద్ధియగును క్షీణించును. ఒక ఱ్ఱాను మొద్దుగనున్నప్పుడది యెవరి మనస్సును నాకర్షింపఁజాలదు. దానినే యందమైన బొమ్మగాఁ దీర్చితిమేని యది చూపఱు మనస్సు నాకర్షింప శక్తిగలదగును. మునుపు లేని యీ శక్తి క్రొత్తగా వచ్చినదా? లేదు, దశాభేదముచే వచ్చినది. మునుపు పెరుఁగులో వెన్నవలె మఱుఁగుపడియుండినది. ఇప్పుడు బయటఁబడినది. ఈ బొమ్మకే సొమ్ములుపెట్టి మంచి వస్త్రముకట్టిన నీయాకర్షణశక్తి హెచ్చును. ఇది సంయో.

గము వలననైన శక్తి. దీనికి మసిపాతఁగట్టి పేఁడపూసిన నా కర్షణశక్తి క్షీణించును. ఉప్పు, మంచుగడ్డ కలిసినఁ జలమిరి హె చ్చగును. నెయ్యి తేనె సమభాగములుగఁ జేరిన విషమగును. గంధకము బొగ్గు సురాకారముచేరినఁ దుపాకిమందగును. సూ ర్యునందును భూమియందునేకాక యాకర్షణశక్తి కొంచెదిగనో గొప్పగనో యన్నిటియందుఁగలదు. ఆకర్షించు వస్తువు మంచి దైనచో నాకర్షింపఁబడు దానికి మేలుగలదు. చెడ్డదైనచోఁ గీడుగలదు. మన తల్లి దండ్రుల భార్య బిడ్డల ఛాయాపట ములఁ జూచిన వారెవ్వరైన మనల వీరెవ్వరని యడిగిన నా కాగితములను జూచి యీమె నాతల్లి యీయన నాతండ్రియని యిట్లు చెప్పుదుము. వారిలోఁ జచ్చిన వారెందఱో దేశాం తరముననుండు వారెందఱో గృహాంతరముననుండు వారెంద ఱో వారట్లు రంగు బొమ్మ కాగితములుగా వచ్చి యద్దములోఁ జొరఁజడిరా? ఆ కాగితములకే మనము పుట్టితిమా? ఆ పటము లను జూచినపుడు వారు వారు మనకుఁ గాఁజేసిన కార్యములు జ్ఞప్తికివచ్చునా యది యుట్టమీఁది రంగు బొమ్మయని తోఁచు నా? అది బొమ్మయనియే తోఁచునందురేని యట్టివారి ప్రతి రూపమును దీసి దానిపై నుమిచి, మూత్రము విడిచి, పాదరక్షా ప్రయోగమాచరించి గాడిదపైఁబెట్టి యూరేగించినఁ దమ మనస్సున నాయాసపడరుగదా? పటములను బొమ్మలను నెవ్వ రేమి చేసిన మాకేమని తలఁతురుగదా. అట్టులే దేవాలయ మందు విగ్రహమును జూచినపుడాయామూర్తి లీలలు జ్ఞప్తికి

వచ్చునుగాని యది ఱాయియా లోహమా యని జ్ఞప్తికిరాదు. దేవాలయమునకుఁ బోవువారు దేవాలయమునకుఁ బోదము దేవతాదర్శనము చేసికొని వత్తమని యందురుకాని బొమ్మల యంగడికిఁ బోవునపుడు మాట్లాడినట్లు మాట్లాడరుగదా. ఏల? వారి యభిప్రాయము సర్వసాధారణము దేవాలయములోని విగ్రహము సాక్షాద్దేవుఁడనియే. యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ.

సర్వాంతర్యామియగు భగవంతుఁడు హృదయములందే కాని విగ్రహములందు లేఁడా? కలఁడందురేని యేల వానిని భగవత్స్థానములుగ భగవత్స్వరూపములుగ భగవన్మయములుగఁ బూజింపరాదు? పూజించిన దోషమేమి?

దేవాలయములోనికి భక్తునిఁ బిలిచికొనిపోయి యందలి మూర్తిని జూపి యిది యెవ్వరనిన భగవంతుఁడు స్వామియని బాలుఁడైనఁ జెప్పును.

అట్లైనచో భగవంతుఁడు సర్వాంతర్యామిగాను యన్నిట నున్నవాఁడు కావున మనకుఁ గానవచ్చు చెట్లను గుట్టలను వీథి యందలి ఱాలను అప్పలను గుక్కలను గాడిదలను బూజింప వచ్చునుగదా. ఇఁక దేవాలయములతో నేమి పనియను ప్రశ్న రావచ్చును.

ప్రతిపదార్థము భగవన్మయమే భగవత్స్వరూపమే భగవదాత్మకమే భగవదావాసమే కావునఁ బ్రతిపదార్థము పూజ్యమే.

ఎవనికి? ఇట్టి శ్రద్ధ భక్తి నిశ్చయజ్ఞానముగలవానికిఁ, బ్రహ్లాదుని వంటివానికి.

ఈ యాక్షేపకు లన్నిటిని గుక్కను గాడిదను ఆయిని జెట్టును భగవంతుఁడు స్వామియని యనుచున్నారా? అనుకొను చున్నారా? లేదుకదా. అట్టి భావన లేనప్పుడు వారి కా చెట్టు గుట్ట లెట్లు దేవతలుకాఁగలవు? ఫలమీయఁగలవు? అట్టి భావన యున్నదందురా వీథులలోనుండు ఆలు భగవంతుఁడను నధ్యవసాయమున్నచోఁ దదాకృతి వహించిన దేవాలయములోని విగ్రహము భగవన్మూర్తిగాఁ దోఁపక వేఱువిధముగాఁ దోఁపనేల? కావునఁ గానవచ్చు పదార్థమంతయు భగవంతుఁడుగానే నీకుఁ గానవచ్చెనా యప్పుడు నీవు దేవాలయములోనికిఁ బోకున్నను దోషములేదు. అట్లు గానరాకపోయెనా నీవు దేవాలయమునకుఁ బోయిననే నీవు సులభముగాఁ గడతేఱుదువు. అట్టి యధ్యవసాయము నీకు శీఘ్రముగా స్థిరపడును. లేనియెడల భ్రష్టుఁడవే.

ఒక సాలెపురుగు దేహములోనుండి ప్రోగులు వెలువడి మరల దానియందే యెట్లణఁగునో యట్లే యీ ప్రపంచము భగవత్పరిణామమై భగవంతునకు దేహమై-వాసస్థానమై యాయనవలననే కలిగి యాయనయందే మరల లయించు. "అన్ని రూపులు తనరూపమైనవాఁడు" అన్నట్లు కానవచ్చునట్టి కానరానట్టి రూపములన్నియు భగవదాత్మకములే. ఈ విషయము శ్రుతులే యిట్లు చెప్పుచున్నవి.

"ఈశావాస్య మిదం సర్వమ్" "యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః" "వాసుదేవ స్సర్వమ్" సర్వం ఖ ల్విదం బ్రహ్మ." "బ్రహ్మైవేద మమృతమ్ బ్రహ్మ వేదం విశ్వ మిదం వరిష్ఠమ్" "మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ" "నేహ నానాస్తి కించన "ఏకోవశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి" "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానాం, ఏకో బహూనాం యో విదధాతి కామాన్" యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ। యథా పృథివ్యా మోషధయః సంభవంతి। యథాసతః పురుషా త్కేశలోమాని, తథాక్షరా త్సంభవతీహ విశ్వమ్".

ఇట్టి సంస్కృత వేదాంతవాక్యములు సూక్ష్మ చిదచిద్విశిష్టుఁ డీశ్వరుఁడే స్థూల చిదచిద్విశిష్టుఁడై యంతర్యామియై జగత్స్వరూపముగఁ బరిణమించెనని స్థాపించుచున్నవి. తనతనమతానుసారముగనైన నీ వాక్యముల యర్థమును స్వానుభవమునకుఁ దెచ్చుకొన్నవాఁ డెవఁడో వాఁడు యోగి, వాఁడు జ్ఞాని, వాఁడారూఢుఁడు. అట్టివానికి శమము కార్యమైనను బ్రమాదపతన భీతిని, లోకసంగ్రహార్థము కర్మములు చేయుచుండవలయును.

శ్లో. ఆరురుక్షోర్మునే ర్యోగం, కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ, శమః కారణ ముచ్యతే. భగ౬-౩

ద్వి. యోగంబుఁబొందంగ నూహించుమునికిఁ,
గర్మ ముక్తం బయ్యెఁ గారణమనుచు

నిర్మలయోగంబు నెఱిఁ బొందినట్టి
యతనికి సాధనం బందురు శమము.

యోగారూఢుఁ డెవఁడు?

శ్లో. యదా హి నేంద్రియార్థేషు, న కర్మ స్వనుషజ్జతే
సర్వసంకల్పసన్న్యాసీ, యోగారూఢ స్తదోచ్యతే. ౬-౪.

ద్వి. చ్యుతకాంతుఁడగు నెప్డు సారిదిఁ గర్మముల
విషయాళి నప్పుడు విడిచి కామంబుఁ
బృషదశ్వజానుజా! పిలువంగఁబడెడు
నతఁడు యోగారూఢుఁ డంచును జగతి.

శ్రీశైల వేంకటాద్రులను బలరాముఁడు తీర్థయాత్రాకాలమున సందర్శించినట్లు శ్రీ భాగవతమున దశమస్కంధమున నుత్తరభాగమున ౭౯-వ యధ్యాయమునఁ గలదు.

శ్లో. స్కందం దృష్ట్వా యయౌ రామః, శ్రీశైలం గిరిశాలయమ్
ద్రవిడేషు మహాపుణ్యం, దృష్ట్వాద్రిం వేంకటం ప్రభుః॥

సర్వాత్మక బ్రహ్మోపాసనాసిద్ధులకే దేవపూజ విహితమై యుండఁ బామరులమాట చెప్పనేల? పామరు లంగిళ్లయందలి బొమ్మలకు దేవాలయమందలి విగ్రహములకుఁ దారతమ్య మెఱిఁగి దేవతాభక్తి యుక్తులై యున్నవారుగని ముడ్డినుండి మూతినుండి వచ్చునది గాలియేకదా యేమిభేద? మని రెంటిని సమముగఁ నెంచి వాదించు తెలిసితెలియని పండితంమన్యులే భక్తిశూన్యులై తాముచెడి పరులను జెఱుపఁ దలఁచుచున్నారు.

23.3.63

## విగ్రహారాధన మేనాఁటినుండి యున్నది.

ధర్మము నాలుగుపాదముల నడచుచు 'ధ్యాయన్ కృతే' యన్నట్లు జ్ఞానమార్గమున వర్తించువారు విశేషముగనుండు కృతయుగమునందే మనువునకు రెండవవాఁడైన యిక్ష్వాకుమహారాజు భగవంతుని ధ్యానింపఁగా నాయన సాకారుఁడై జగన్మోహనమూర్తి ధరించి ప్రత్యక్షమయ్యెను. ఆ దివ్యమంగళ విగ్రహమును జూచి యిక్ష్వాకుఁడు దేవా యీ రూపముతోనే మా యింట నీవు వెలసి మాచే దినదినము పూజ నంగీకరింపవలయు నని కోరఁగా నట్లే కానిమ్మని యాయన వరమిచ్చెను. ఈ శ్రీరంగనాథమూర్తినే "ఆరాధయ జగన్నాథ మిక్ష్వాకు కుల దైవతమ్" మని చెప్పి శ్రీరామచంద్రమూర్తి విభీషణున కనుగ్రహించెను. ప్రహ్లాదుఁ నరసింహమూర్తుల విషయము లోకమెఱింగినదే. ఇఁకఁ త్రేతాయుగమునఁ బాదధర్మము లుప్తమగుటచేఁ బౌతికశక్తి తగ్గి జనులు భగవంతుని సాక్షాత్కరింపఁ జేసికొను శక్తి లేనివారగుటచేఁ బరమదయాళుండు జీవరక్షాబద్ధ కంకణుఁడైన భగవంతుఁడు స్వయంవ్యక్తమూర్తియై కొన్నికొన్ని స్థలముల వెలసి భక్తులకు దర్శన మీయసాగెను. శ్రీరాములకాలమునకు ముందే యయోధ్యయందు దేవాలయము లున్నట్లును, సీతారాములు విగ్రహారాధనము చేసినట్లును రామాయణమునఁ గలదు.

శ్లో. దేవాయతన చైత్యేషు, సాన్నభక్షాః సదక్షిణాః
ఉపస్థాపయితవ్యాస్స్యుః, మాల్యయోగ్యాః పృథక్పృథక్
అయో 3-౧౮.

శ్లో. శ్రీమత్యాయతనేవిష్ణో, శ్శిశ్యేనరవరాత్మజః ౬-౪౪
సితాభ్రశిఖరాభేషు, దేవతాయతనేషుచ॥ ౬-౧౧
శుక్లదేవ గృహద్వారాం, సర్వవాదిత్ర నిస్వనాం ౭-౪
చతుష్పథాన్ దేవపథాం, శ్చైత్యాన్యాయతనానిచ
ప్రదక్షిణం పరిహరన్, జగామనృపతేస్సుతః॥ ౧౮-౧౬౮
యేభ్యః ప్రణమసేపుత్ర, చైత్యేష్వాయతనేషుచ
తేచత్వామభిరక్షంతు, వనే సహ మహర్షిభిః ౨౫-౪
ఆచమ్యచ యథాశాస్త్రం, నదీంతాం సహసీతయా

భగవన్మూర్తినేకాదు సీతాదేవి వృక్షములను నదులను బూజించెను.

శ్లో. వైదేహీ ప్రాంజలిర్భూత్వా, తాం నదీ మిదమబ్రవీత్
పుత్రో, దశరథస్యాయం, మహారాజస్య ధీమతః
నిదేశం పారయిత్వేమం, గంగేత్వ దభిరక్షితః
చతుర్దశ హివర్షాణి, సమగ్రాణ్యుష్యకాననే
భ్రాత్రాసహ మయాచైవ, పునః ప్రత్యా గమిష్యతి
తతస్త్వాం దేవి సుభగే, క్షేమేణ పునరాగతా
యక్షే ప్రముదితా గంగే, సర్వకామ సమృద్ధినీ।
గవాంశత సహస్రాణి, వస్త్రాణ్యన్నంచ పేశలమ్।
బ్రాహ్మణేభ్యః ప్రదాస్యామి, తవప్రియ చికీర్షయా॥ ౫౨-౮౮
విస్తృద్ధం బహుభిర్వృక్షై, శ్శ్యామం సిద్ధోపసేవితమ్
తస్మై సీతాంజలింకృత్వా, ప్రయుంజీతాశిషః శివామ్॥ ౫౫౭

కాళిందీ మధ్యమాయాతా, సీతా త్వేనామవందత
స్వస్తిదేవి తరామిత్వాం, పారయేన్మే పతివ్రతమ్
యక్ష్యేత్వాం గోసహస్రేణ, సురాఘటశతేనచ
స్వస్తిప్రత్యాగతే రామే, పురీమిక్ష్వాకుపాలితామ్ ౫౫-౨౦
నమస్తేస్తు మహావృక్ష, పారయేన్మే పతివ్రతమ్
కౌసల్యాంచైవ పశ్యేయం, సుమిత్రాంచ యశస్వినీమ్
ఇతి సీతాంజలింకృత్వా, పర్యగచ్ఛ ద్వనస్పతిమ్ ॥ ౫౫-౨౫

ఇఁక ద్వాపరమందో శ్రీకృష్ణుఁడు పర్వతపూజ చేయించెఁగదా. గోపికలిసుకతో గౌరిని జేసి పూజించిరికదా. రుక్మిణి కల్యాణమునాఁడు గౌరీదేవ్యాలయమునకుఁ బోయి వచ్చెఁగదా. మణినిమిత్తమైకృష్ణుఁడు జాంబవంతునితోఁ బోరుసమయంబునఁ దన్నర్సించిన ద్వారకాపౌరులకు దుర్గ "బాలామణితో మణితో, హేలాగతివచ్చునంబు జేకొనుఁడనుచుఁ" జెప్పెనుగదా. శ్రీకృష్ణుఁడు యుద్ధవునకు విగ్రహారాధనము దేవాలయ నిర్మాణము బోధించెఁగదా. భాగ. ౧౧ స్కంధము.

ద్రోణమరణానంతర మర్జునాశ్వత్థామలు పోరునెడ నశ్వత్థామ ప్రయోగించిన యాగ్నేయాస్త్ర మర్జునుచే హతమైపోఁగా విసిఁగి యుద్ధము చాలించుకొని పోవుచున్న యశ్వత్థామకు వ్యాసులు ప్రత్యక్షమై నీవు పూర్వజన్మమున శివుని విగ్రహమును బూజించితివి. అర్జునుఁడు శివలింగమును బూజంచెను. శివవిగ్రహపూజకన్న లింగపూజయే శ్రేష్ఠము. పూజాతారతమ్యమునబట్టి శక్తితారతమ్యము మీకుఁ గలిగెనని బోధించెఁగదా. ఈయిరువుర పూర్వజన్మమెట్లుడో యాలోచింపుఁడు.

గీ. శుభ్రమగు నుర్విస్మృత్తిక సురుచిరంపుఁ
బ్రతిమఁ గావించికొని యందుఁ బరమునావ
హించి పూజావిశేషంబు లెల్లఁ జేసి
నీవు దొలుమేనఁ గొల్చితి నిష్ఠతోడ.

కం. వారలు లింగాధిష్ఠా
నారాధుంగా నొనర్చి యర్చించిరి భ
వ్యారాధన పరులైమును
గౌరీపతి నతుల నియమకల్పన వెలయన్ ॥ ద్రోణ. ౫. ఆ.

ఇఁక మార్కండేయుఁ డేనాఁటికాలమువాఁడో యెప్పుడు శివలింగపూజచేసి మృత్యువును జయించెనో యాలోచింపుఁడు.

శ్రీ మహాభారతము సభాపర్వము ౭౮. అధ్యాయము.

శ్లో. అర్చా యత్ర ప్రనృత్యంతి, నదంతిచ హసంతిచ
ఉన్మీలంతి నిమీలంతి, రాష్ట్రక్షోభం వినిర్దిశేత్ ॥
ఆరణ్యపర్వమున. ౧౯౩ అధ్యాయము

శ్లో. ఆశ్రమేషు మహర్షీణాం, బ్రాహ్మణావసథేషుచ
దేవస్థానేషు చైత్యేషు, నాగానా మాలయేషుచ
ఏడూక చిహ్నపృథివీ, న దేవగృహభూషితా ॥
భవిష్యంతి యుగేక్షీణే, తద్యుగాంతస్యలక్షణమ్ ॥ ౬౨.
శాంతిపర్వము. ౧౪౧ వయధ్యాయము

శ్లో. ఉలూకపక్షి ధ్వనిభిః, దేవతాయతనైర్వృతమ్
లోహఘంటా పరిష్కారం, శ్వయూథ పరివారితమ్ ॥ ౩౨.

మ. దేవతాయతనంబులున్ జగతీసురావసథంబులున్
బావనాశ్రమ భూములున్, జెడిపాడగున్; శుభస్ఫుటవ

ల్లీవనంబులు నాశమొందుఁ గలి ప్రచారమునందు దు
స్త్రీ విహారము మద్యపానము చెల్లుఁ బెల్లుగ నెల్లెడన్. అరణ్య
శ్రీమద్రామాయణమందు రావణాసురుఁడు శివలింగపూ
జ చేసినట్లు కార్తవీర్యార్జునితో యుద్ధము చేయు ఘట్టమునఁగల
దు., ఇంద్రజిత్తు హోమము చేయు నికుంభిల గుఱించి "నికుంభి,
లాఖ్య దేవతాయతన" మని వ్యాఖ్యాతలు వ్రాసిరి. మఱియు
మనుస్మృతియందుఁ
శ్లో.నిత్యం స్నాత్వాశుచిః కుర్యా, ద్దేవర్షి పితృతర్పణమ్
దేవతాభ్యర్చనం చైవ, సమిదా ధాన మేవచ ॥
"దేవతాభ్యర్చనం ప్రతిమాదిషు, హరిహరాది దేవపూజ
నమ్" అని కుల్లూకభట్టు
శ్లో.నఘాలకృష్టే నజలే, నచిత్యాం నచపర్వతే
నజీర్ణ దేవాయతనే, నవల్మీకే కదాచన
"దేవతాన్యభిగచ్ఛేత్తు ధార్మికాశ్చ ద్విజోత్తమాన్" పాపా
ణాదిమయ్యం. వ్యాఖ్య
ఈవిధముగ శ్రుతి స్మృతి పురాణేతిహాససిద్ధాంతితమై
వేదమూల భగవదుపదిష్టపాంచరాత్రానుసారమైన విగ్రహా
రాధనము భక్తియోగము పుట్టిననాఁడు పుట్టియనాదిగ నన్ని
యుగంబుల నారదాదిమహర్షులచేతను, నిక్ష్వాక్వాది మహారా
జులచేతను ననుష్ఠింపఁబడియె. ఈ విగ్రహారాధనమే సాకారోదు
పాసనము. సాకారోదుపాసనము దహరవిద్యారూపము. ఇదే
యనంతాక్షయఫలకము. ఇది భగవత్ప్రాప్తికిఁ బ్రతిబంధకరూ

పములైన బాహ్యవాసనల నిర్మూలించును. అంతియగాక ధ్యాన లక్షణమైన యభ్యంతరయాగమును దృఢపఱుచుటచే నట్టివారి కిని నుపకారమగుచున్నది. ఇది కోరికలుగలవారికిఁ గోరిక లను, నిష్కాములకు మోక్షమును గలిగించును. దీనికిఁ బ్రమాణ వాక్యములు. "అఖిలహేయ ప్రత్యనీక కల్యాణగుణైక తానశ్రీ భగవత్ప్రాప్తిరూప పరమపురుషార్థ సిద్ధయే శేష శేషి జ్ఞానపూ ర్వక సాక్షాదుపాసన మనుకూలసామగ్రి. సాక్షాదుపాసనన్తు దహరవిద్యారూపం. తదేవా నంతాక్షయఫలకం. అథయది దమస్మిన్ బ్రహ్మపురేదహరం పుణ్డరీకం వేశ్మేత్యాది శ్రుతిసిద్ధోపా సన విశేషవిస్తార ఏవభగవచ్ఛాస్త్రోక్త బాహ్యాభ్యంతర యాగలక్ష ణం సమారాధనం బాహ్యయాగశ్చ భగవత్ప్రాప్తి ప్రతిబంధకీ భూత బాహ్యవాసనా పనోదకః శ్లో. బాహ్యార్థవాసనా విప్ర బహు జన్మార్జితాదృఢా, లోలీకృతేన యాహ్యాత్మా శుద్ధోశుద్ధ స్వరూపయా! యా మంత్రవిషయా శుద్ధా క్రియా శాంతస్వరూ పదా! సముత్థాన వినాశార్థం, తస్యాస్సం పరికీర్తితం॥ సబాహ్యా భ్యంతరాభ్యాంచ క్రియాభ్యాం తన్నయోభవే॥దితి జయాఖ్యే భగవాన్ ॥ బింబాకృత్యాత్మనా బింబేసమాగత్యావతిష్ఠతే। కరోత్యమూర్తా మఖిలాంభోగశక్తింతు చాత్మసాత్ । మంత్రైర్వ్య ఖ్యాత్రైరారాధ్యసూక్తేన పురుషేణవా, అథవాద్వాదశ వర్ణా ద్యైర్థం త్రైబింబముఖేహరిం, ప్రపద్యతే పరంశ్రేయో నిష్కా మో యదిపూజకః ఇతి సాత్వతపాద్మయోః భగవద్వచనాత్ ధ్యానలక్షణాభ్యంతర యాగస్య దార్ఢ్యాపాదన ద్వారా తదుప

కారకః పరమనిశ్శ్రేయస సాధకశ్చ॥ అని ఆలయ నిత్యార్చన పద్ధతి. ఇంకలి "బింబాకృత్యాత్మనా బింబే సమాగత్యావతిష్ఠతే" గుఱించి కొంచె మర్థము వివరించెదను. "బింబం=ఆరాధకైర్యథారుచి సువర్ణరజతాదిభిర్నిర్మితా ప్రతిమా తస్యా ఆకృతిరివ, ఆకృతిః యస్య సః బింబాకృతిః సచాసౌ ఆత్మా చేతి కర్మధారయః। అత్ర ఆత్మశబ్దో విగ్రహపరః. బింబసదృశ విగ్రహేణేత్యర్థః. బింబే ప్రతిమాయాం సమాగత్య సమిత్యేకీకారే నీరక్షీరవదవిభాగేన సంశ్లేషం ప్రాప్యేత్యర్థః, అయం ప్రాకృత భాగః అయ మప్రాకృత భాగ ఇతి విభజ్య జ్ఞాతుం యథానశక్యేత తథా పరవ్యూహ విభవాది బింబానురూపేణ శరీరేణ తత్ర బింబే ఏకీభూయ సన్నిదధాతీత్యుక్తం భవతి" యని ఫణిపురం రంగనాథభట్టాచార్యవ్యాఖ్య.

ఆరాధకుల యభిరుచిప్రకార మేర్పఱచుకొన్న బింబమందు దాని యాకారమునే వహించి దానియందుఁ బాలు నీళ్లు కలసినట్లు నీరక్షీరన్యాయమునఁ భగవంతుఁడు కలియును. ఇది ప్రాకృతభాగ మిది యప్రాకృతభాగమని వేఱుపఱుప సాధ్యముగానియట్లు పర, వ్యూహ, విభవాదిరూపముల కనురూపమైన శరీరముతో నా విగ్రహమందు సన్నిధానమగునని యర్థము. విశేషముగ నాత్మచే గ్రహింపఁబడునది విగ్రహము. బేరమనఁగా శరీరము కావున బేరపూజయనఁగా భగవచ్ఛరీరపూజయనియే యర్థము. విగ్రహమును దెనుఁగున బొమ్మ యందురుగదా. ఆమాట కేమి యర్థము. బ్రహ్మశబ్దభవము బొమ్మ.

బ్రహ్మదేవుఁడే బొమ్మదేవర. కావున బొమ్మపూజయనఁగాఁ బర బ్రహ్మపూజ యనియే యర్థము. ఇప్పటి యీ మహానుభావులు శబ్దార్థమునుగాని, బాల్యము మొదలు భగవచ్చింతన మేర్పాటు చేసిన పూర్వుల యుద్దేశముగాని, యూహింపలేక నోటికివచ్చినట్లు వాగుచుందురు. కలిముదురుకొలఁది యిది వింతగాదు.

మనుష్యులందు నలుదెగలవారు గలరు.

౧. అనేక పూర్వజన్మవాసనాబలమున నీ జన్మమున జన్మసిద్ధులో సాధనసిద్ధులోయై జీవన్ముక్తులై త్రొక్కుడు ఱాయి మొక్కుడు ఱాయి సర్వము వాసుదేవాత్మకమని ప్రత్యక్ష దర్శనముచే సార్థకజన్ములైనవారు. వీరు యోగులు సిద్ధులు. మనుష్యాకారము నున్న దేవతలు. వీరుత్తములు.

౨. తను మనుష్యత్వము సార్థకము చేసికొనఁగోరి ధ్యానభజన పూజాదులచే భగవద్విగ్రహముల నారాధించుచు భక్తియుక్తులై ఫలాపేక్ష లేక దేవతాకార్యములుగాని శరీరయాత్రా కార్యములుకాని చేయుచు భగవత్కటాక్షమునకు నెప్పుడు పాత్రులమగుదుమాయని తహతహలాడువారు. వీరు మధ్యమ మనుష్యులు.

౩. విశేషభక్తిలేకున్నను దేవతానిందసేయక యత్కించిద్భక్తి గలవారై బుద్ధిపుట్టినపుడుగాని యాపదలందుఁగాని దేవతాదర్శనమునకయి పోవుచు నాపదమ్రొక్కులు సంపదమ్రొక్కులు గలవారు. వీరధమమనుష్యులు.

౪. దేవుఁడు లేఁడనికాని దేవుఁడు వేఱేయెందున్నవాఁడు మేమే దేవతలమని కాని వదరుచు శిశ్నోదర పరాయణులై

త్రొక్కెడు బాయి మ్రొక్కెడు బాయి రెండుబాలుగానే యెంచుచు వర్తించువారు. వీరధమాధమమనుష్యులు. అనఁగా మనుష్యాకారమునఁ దిరుగు పశువులు.

మొదటివారు జీవించియుండియే ముక్తులు. రెండవవారు భక్త్యతిశయముకొలఁది యీ జన్మమందో మఱుజన్మమందో ముక్తులగువారు. మూఁడవవారు కతిపయ జన్మంబులఁ గడదేఱువారు. నాలుగవరకమువారు మనుష్యత్వమును వ్యర్థపఱిచికొని యధోగతులకుఁ బోవువారు.

మంత్రపూతములైన విగ్రహములకును సంగళ్లయందలి బొమ్మలకును గల భేదము దృష్టాంతముచేఁ దెలిపెదను.

మనలోఁ గలసిమెలసియుండు నొకనికి మండలాధిపత్య మొసంగినట్లు ప్రభువునొద్దనుండి దమ్మిడివెలచేయని యొక లిఖిత పత్రము వచ్చెననుకొనుఁడు. వెంటనే వానిముఖవికాసము తేజస్సు నాలోకింపుఁడు. ఉత్తరక్షణమందే సేవకులరుదెంచి స్వామీ స్వామీ చిత్తముచిత్తము భాగ్యముభాగ్యము దేవరదేవర యని చేతులు జోడించుకొని భయభక్తులతో వత్తురు. వాఁడిప్పుడు కొందఱి శిక్షింపను గొందఱి రక్షింపను శక్తిగలవాఁ డగుచున్నాఁడు. ఈ శక్తి తేజస్సు వానికెందుండి వచ్చెను? ఇంతలో మనకంటె వాఁడు గొప్పవాఁడెట్టులయ్యెను?

లోకములో వేఁడిమిలేని పదార్థమే లేదు. మంచుగడ్డయందును వేఁడిమిగలదు. చల్లగానుండు నినుపగుండును మనము తాఁకఁగలము. ఆ గుండునే కొలిమిలో వేసి కాఁచినఁ దాఁ

కంగలమా? రెండును సమానగుణములు గలవగునా? అగ్నియం దుండు గుణములన్నియు నెట్టిగాం గాలిన యినుపగుండునందుం గలవుగాని చల్లని గుండునందుం గలవా? అట్టులే మంత్రములు విగ్రహముల యందుండు భగవత్తేజస్సును వృద్ధిపఱుపం గలుగును. మంత్రబలముచేం దృణాదులు మహాస్త్రములు గావా? కాకాసురుని మూండు లోకముల నల్లాడం బెట్టిన దేది? అంగారపర్ణునిపై నర్జునుండు ప్రయోగించిన దేది? కావున మంత్రవంతములైనవి కానివి సమానములని జ్ఞానహీనుండు చెప్పునుగాని యత్కించి జ్ఞానమున్నవాండైనను జెప్పండు. జ్ఞానయోగులకుం గర్మయోగులకు దుర్లభమైన భగవత్సాక్షాత్కారము భక్తులకు సులభమగుటచేతనే దీనికిని దక్కినవానికిని గలభేదము తెలియలేదా. అద్వైతలక్షణమెఱుంగక స్వాచార్యుల యభిప్రాయము గ్రహింపం జాలక, వారివాక్యములందు లక్ష్యములేక. మేమే బ్రహ్మలము. వేఱే దేవుం డెందున్నాండు. మేమేమి చేసిన దోషమేమి? బ్రహ్మమునకుం బుణ్యపాపములు గలవా? విధినిషేధములు గలవా? దానమేమి? ధర్మమేమి? ఇచ్చువాండెవండు? తీసికొనువాండెవండు? అని వెఱ్ఱికూంతలు గూయుచు మద్యపాన మాంసభక్షణ, రతులయి కులస్త్రీలం జెఱుచుచుం బరులవిత్త మపహరించుచుం దిరుగు శుష్కవేదాంతుల కెవ్వనికైన భగవద్దర్శనము లభించెనా? భక్తవిజయములవంటి గ్రంథములు త్రాగుబోతులు కూంగుబోతులు మూలుగుబోతులు దుశ్చరిత్రులునైన యీ వేదాంతుల విషయమునం గలిగెనా? భగవంతుండు సర్వవ్యాపియై

యీయనశక్తి యన్నిటియందున్నను గొన్నిటియం దెక్కువగను గొన్నిటియందుఁ దక్కువగను గానవచ్చును. సూర్యుని కాంతి యగ్నియందుఁ గలదా. అగ్ని కాంతి గుణము మిణుఁగురు పురుగునందుఁగలదా.

దేవతలు మంత్రాధీనులు. మంత్రములకును దదధి దేవతలకు నభేదము. వాచ్యవాచకము లభేదములు. 'తస్య వాచకః ప్రణవః' యని కలదుగదా. కావున మంత్రబలముచే భగవచ్ఛక్తిని విగ్రహములయం దావహింపఁ జేసినయెడల నవి వీర్యవంతములై భక్తుల యభీష్టము నెఱవేర్పఁ జాలినవగు చున్నవి. అగ్నితప్తములైన యినుపగుండ్లతత్త్వమే యెట్లు మాఱునో యట్లే మంత్రపూతములైన విగ్రహముల తత్త్వము మాఱును. మంత్రముల బలమెఱిఁగినవారు దీనిని సందేహింపరు. యథావిధి ప్రతిష్ఠిత విగ్రహమునకు నుత్తవిగ్రహమాత్రమునకు నిప్పునకు బొగ్గునకుఁ గల తారతమ్యము గలదు. కాలిన గుండును నట్లే యూరకవిడిచిన వేఁడిమి పాసినదై చల్లగుండగు నట్లు సుప్రతిష్ఠితవిగ్రహములకు శాస్త్రప్రకారము పూజాదులు జరపక యనాచారులు దురాచారులు భ్రష్టులు మంత్రజ్ఞానహీనులు నర్చకులై యశ్రద్ధచేసిరేని కొంతకాలమున కవి మహిమపోయినవై రాతిబొమ్మలే యగును. అంతతోఁ బోయిన మేలే. అట్లగుటకుముందు గ్రామనాశము గావించును.

శ్లో. సర్పం దృష్ట్వా యథా కాయీ, కంపతే చ ముహుర్ముహుః
అమంత్ర మర్చకం దృష్ట్వా, తథా భీతో జనార్దనః ॥

గంధహీనే భయోత్పత్తిః, పుష్పహీనే తు సంకులమ్
నైవేద్యహీనే దుర్భిక్షం, మరణం మంత్రహీనకే ॥
అమంత్ర మవిధిం చైవ, మకాలం చైవ పూజనమ్
నిత్యం రాష్ట్రభయం కుర్యాత్, తద్గ్రామంతు వినశ్యతి ॥

పామునుజూచి మనుష్యుఁడు వణఁకునట్లు మంత్రహీనుఁడైన యర్చకునిఁజూచి దేవుఁడును వణఁకును, గంధములేకున్న భయము, పూలులేకున్న సంకులము, నైవేద్యము లేకున్నఁ గఱవు, మంత్రములు లేకున్న మరణము గలుగును. మంత్రములు చెప్పకుండినను, నశాస్త్రరీతిఁ బూజించినను అకాలపూజయు రాష్ట్రభయము కలిగించుటేగాక గ్రామమును నాశము చేయును. ఇవి లోపములేక జరగిన గ్రామమునకు రాష్ట్రమునకు నెంతో క్షేమముగలదు.

ఇప్పు డనాచారులు దురాచారులు చోరులు జారులు భ్రష్టులు, పతితులు కుక్షింభరులు నర్చకు లగుచున్నారు. విశ్వాసఘాతకులు, స్వామిద్రోహులు దేవస్వాపహారులు ధర్మహర్తలు ధర్మకర్త లగుచున్నారు. కుమతిధారులు కటిటీధారు లగుచున్నారు. చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతి పిందెలు పుట్టునుగదా.

ఎట్లుగాఁ గాలినగుండ్లు వేఁడిమిని వెదచల్లునట్లు యథావిధి పూజింపఁబడు నర్చారూపములు తమ తేజస్సును దర్శింప వచ్చిన భక్తులమీఁదను, దేవాలయావరణమందును వెదచల్లుచుండును. అగ్ని తప్తలోహగోళము పూర్వకాఠిన్యముఁ బాసి

మైనమువలె నెట్లగునో యట్లే విగ్రహములును దమ పూర్వ కాఠిన్యమును బాసి చైతన్యముగలవై చలన సంభాషణాది కార్యములఁ జేయఁగల వగును. ఏల? పాలు నీళ్లు కలసినట్లు ప్రాకృతాప్రాకృతభాగ విభజనము సాధ్యపడనట్లు భగవంతుఁడు ద్దానియందుఁ బ్రవేశించును. భగవంతుని షడ్గుణములను నవి కలవగును.

"సర్వాతి శాయి షాడ్గుణ్యం,
సంస్థితం మంత్రబింబయోః ॥
అర్చాపి లౌకికీ యాస్యా త్సాపి
షాడ్గుణ్య విగ్రహః ॥ లక్ష్మీతంత్రము. అని ప్రమాణము.

కం. కదలెడి వేల్పుల గూపులు,
పదలెడిఁ గన్నీరు, వానివలనం జెమటల్
పొదలెడి, బ్రతిమలు వెలిఁజని
మొదలెడి నొక్కొక్క-కుడిచి మేదిని యందుల్. భాగవతము.

ఈ విషయమున విశ్వాసము లేనివారు నెలకుముందు 23—8—1925—వ తేదియందు హిందూపత్రికయందు నాగపూరులోని పాండురంగస్వామి రుక్మిణీదేవి కన్నులనుండి పంద్రెండుగంటలు కన్నీరు ప్రవహించెనని ప్రకటింపఁబడిన విషయము చూచియైన మతిమంతు లగుదురుగాక.

'Idol's tears. Curious Nagpur incident.

A Nagpur message to "the Times of India" tells of hand-bills signed by Mr. Narayana Rao Hedas describing a strange incident. On the 17th August tears were seen for

12 hours rolling down the checks of the idols of Vittal and Rukmini in the temple of Pandurang Budvari, Nagpur, and thousands of people witnessed the incident. As a result of this strange phenomenon special prayers are being offered in the temple. Several people ascribe this effusion of tears from the idols to the death of Tajuddin Sahib, the mahomedan saint, which occured on that day"

ఈ విషయమై శ్రీ మహాభారతమున నిట్లు చెప్పఁబడినది.

శ్లో. అర్చాయత్ర ప్రనృత్యంతి, నదంతిచ హసంతిచ
ఉన్మీలంతి నిమీలంతి, రాష్ట్రక్షోభం వినిర్దిశేత్ ॥

మహాభారతము. సభా. ౭౮. అ.

దేవాలయములందలి విగ్రహములు నర్తనము చేసినను, ధ్వనించినను, నవ్వినను కన్నులువిచ్చినను మూసినను, రాష్ట్రక్షోభము కలుగునని దీనియర్థము. ఇదిగాక "బాలామణితో మణితో, హేలాగతివచ్చి నంబుజేక్షణుఁ డనుచున్" దుర్గాదేవి జాంబవతీకల్యాణ కథాసందర్భమునఁ జెప్పినవాక్యములు, కాళికి బలి యియ్యఁబూనిన రాజుకథ, లోనైనవియు, బీబీనాంచారు, మేలుకోట సంపత్కుమారస్వామి, కంచివరదరాజులు, వేంకటేశ్వరులు హాత్తీరాంబాబాజీతో నాడినవిధము, భద్రాచలరామమూర్తి రామదాసుని విషయమున వర్తించినతీరు, సాక్షిగోపాలచరిత్రములోనైనవి స్మరింపుఁడు. భక్తవిజయమును బఠింపుఁడు. ఈ యొంటిమిట్టయందు నిమాంబేగునకుఁ గోదండరామమూర్తి మాఱుపలికినవిధము, అయ్యలరాజు రామభద్రునకు సీతాదేవి

ష్ఠ నప్యమిచ్చుటయు, మాలదాసరి కోబనికై తూర్పుముఖము గనున్న సీతా రామలక్ష్మణులు పశ్చిముముఖులగుటయు, లోనగు చరిత్రములు స్మరింపుఁడు. ఇఁక స్వప్నగోచరులయి చెప్పినమాటలకుఁ, జేసినకార్యములకుఁ, బరోక్షమునఁ గనఁబఱిచిన మహిమలకు నెన్నియో యిప్పుడు నిదర్శనములు ప్రత్యక్షానుభవముసఁగలవు కానిస్వీయములగుటఁ బ్రమాణములుగఁ జెప్పుట సరిగాదని విరమించితి. శ్రీ వేంకటేశ్వర ఘటికాచల నృసింహాంజనేయాదుల మహిమలు జగద్విదితములు గావున వానిని చేర్కొననేల?

ఇట్టి ప్రత్యక్షనిదర్శనము లెన్నియో యుండ విగ్రహారాధకులు మందులనువారికంటె మందులెవ్వరు? వీరి మాంద్యమునకు నరకయాతనయే మందు కాఁబోలు. యుగాంతరముల నుండి దేవాలయముల నేర్పఱిచిన మహాత్ములును, పాంచరాత్రాగమము బోధించిన భగవన్నారాయణుఁడును, దత్ప్రవర్తకులైన నారద శాండిల్యకుమార వ్యాస శుకగర్గవిష్ణుకౌండిన్య శేషోద్ధవారుణి బలిహనుమద్విభీషణాంబరీషరుక్మాంగదాది పరమభాగవతులును, విగ్రహములవలన ధన్యులయిన మార్కండేయాదులును, మతస్థాపకులైన శంకరరామానుజ మధ్వాచార్యులును, చైతన్య రామకృష్ణపరమహంసాదులును, మందమతులైరేని వారిపాలే మాబోఁటియజ్ఞులకు శ్రేయస్కరముగాని యీ మహాప్రాజ్ఞ పొత్తుగాదు. సర్వథాగాదు. మాపాపములకుఁ గోపించి భగవతుఁడు మమ్మెన్ని నరకములనైన నెన్నికల్పములైనఁ ద్రోయునుగా!

ఇట్టివారిపొత్తు మాత్ర మొక క్షణమైన వలదు వలదు ముష్టాటి కిని గలిగింపవలదని ప్రార్థించెదను. విగ్రహములు కదలునా భాషించునాయని యింకను సందేహించువారు గలరేని యట్టి వారు రామకృష్ణపరమహంసగారి జీవితచరిత్రమందలి యీ యనువాదమును పఠింతురుగాక.

"The Babaji" said the Master to a group of disciples, "was the life long devotee of Ramlal whom he would carry where he might go. He would cook whatever he got by begging and offer it to Ramlala. Not only that he would actually find that Ramlala was taking that food or insisting upon other things. Sometimes Ramalal would go out with him for a walk and make all sorts of importunities like an indulgent child. He was then engaged day and night in the service of the image and felt a constant bliss. I could see these movements of Ramlala." - - - - - - - -

"I saw Ramlala as I see you all.—now dancing gracefully before me, now springing on my back or insisting on being taken into my arms. Sometimes I would carry him on my lap. He would not remain there, but go to the fields, run in the sun, pluck flowers from thorny bushes, or jump into the water of the Ganges. I would prevent saying 'Don't run in the sun, you will get blisters on your sole. Don't remain so long in water, you will catch cold and get fever." But Ramlala would turn a deaf ear to it. He would fix his beautiful eyes on me and smile or like a naughty boy he would go on with

his franks or pout his lips or make faces at me. Sometimes I would lose my temper and say "Wait you naughty boy, I am going to beat you black and blue" I would drag him away and diverting his mind with various toys, ask him to play inside the room. But sometimes I lost patience and gave him one or two slaps, With tearful eyes and trembling lips he would look at me. Oh the pains I would feel then for punishing him! I would take him into my arms and console him. All these were actual occurences. "Once" Sri Ramakrishna continued "I was going to bathe. Ramlala insisted on accompanying me. Well, I took him with me. But he would not come out of water and would not mind my remonstrances. Then I got angry and pressing him under water said, 'now play in as much as you like' Ah I saw him struggling for breath. Then repenting of my act I took him into my arms. Another incident pained me greatly and I wept bitterly for it. He was insisting on something which I could not supply. To divert him, I gave him some parched rice not well husked. As he was chewing them I found his tender tongue was scratched. The sight was too much for me. I took him on my lap and cried out "mother Kausalya used to feed you with cream or butter with the greatest care and I was so thoughtless as to give you this coarse stuff".

ఆంగ్లభాషరాని వారి నిమిత్తము దీని యర్థమును సంగ్రహముగఁ దెలిపెదను. రామకృష్ణ పరమహంసగారి మిత్రుఁడొక

బ్రాహ్మణుఁ డుండెను. ఆయనయొద్ద బాలరామ విగ్రహముండె ను. దాని నాబావాజీ యెప్పుడును నెడఁబాసినవాఁడు కాఁడు. ఎక్కడికిఁ బోయినను గూడఁ దీసికొనిపోవుచుండెను. భిక్షముచేఁ దనకు లభించు దానిని బాకముచేసి యీ బాలరామునికి సమ ర్పించుచుండును. అంతమాత్రమే కాదు. ఆయన చూచుచుం డఁగానే యీ బాలరాముఁడు తనముందుంచిన యన్నమును దిను చుండును. అది తినుటమాత్రమే కాక యింకను గొన్ని యితర పదార్థములను దెమ్మని గోజపెట్టుచుండెను. కొన్ని సమయ ములందు బావాజీ బయలసంచారము పోయినపుడు బాల రాముఁడు వెంటనంటి పోవుచుండును. వలదనినఁ దుంటరిపిల్ల వానివలె వెక్కిరించి కొక్కిరించుచుచుండును. ఈ విధముగ నహర్నిశము బావాజికి నా బాలరామునితోనే సరిపోవుచు దా నివలన మహానంద మనుభవించుచుండెను. ఈ బాలరాముఁడు రామకృష్ణపరమహంసగారి యొద్దఁజేరెను. ఈ విషయమై రామకృష్ణపరమహంసగారు తనశిష్యులతో నిట్లు చెప్పిరి.

బాలరాముఁడుచేసిన యీ చేష్టలన్నియుఁ జూచుచుంటిని. మీ రెట్లు కానవచ్చుచున్నారో యట్లే నాకు బాలరాముఁడు కానవచ్చుచుండెను. ఒకప్పుడు నాయెదురఁ జిందులఁ ద్రొక్కుచు నాడును. ఒకప్పుడు నా వీఁపుపై దుముకును. లేదాయెత్తుకొమ్మ ని పోరుపెట్టును. ఒకొక్కసారి నే నెత్తికొనిపోదును.

---

"The metal image of Ramlala may still be seen on the altar of the Kali temple."

అంతటనిలువక పొలములకుఁ బోవును. ఎండలోఁ బరు వెత్తును. ముండ్లపొదలనుండి పూలఁగోయును. గంగాజలముల దూఁకును. “ఎండలోఁ బరువెత్తవలదు పాదములుపొక్కును. నీళ్లలో నానవలదు. జలుబు చేసి జ్వరమువచ్చును” అని యడ్డగింతును గాని నామాట బాలరాముఁడు పెడచెవిఁ జెక్కును. ఒక్కొక్కసారి యాయన సుందరనేత్రములతో నన్ను దృష్టించి చూచును. చిఱునవ్వునవ్వును. కొంటెపిల్లవానివలెఁ దుంటపనులు చేయును, పెదవులు విఱచును. ముఖము ముడుతలుపడఁ జేయును. ఒక్కొక్కసారి నాకుఁ గోపమురాఁగా “కొంటెపిల్లవాఁడా నిలు, నీ దేహము కాయలుకాచునట్లు కొట్టెదను” అని యఱతును. అట్టిసమయంబులందు బాలరాముని దూరముగ నీడ్చుకొనిపోయి గదిలోవేసి యాటవస్తువులిచ్చి గదిలోనే యాడుకొనుమనుచుందును. కొన్నివేళల నోర్పులేక యొకటి రెండు దెబ్బలును గొట్టుదును. అప్పుడాయన కన్నుల నీరుగాఱ పెదవులుఁ వణఁక దీనుఁడైనా మొగముఁ జూచును. అప్పుడాయనను శిక్షించినందునకై యయ్యో నా పరితాపమేమని చెప్పుదును. ఆయనను జంకకెత్తుకొని యూరార్తును. ఇవి యన్నియు వాస్తవముగ జరగినవిషయములు. ఒకనాఁడు నేను స్నానార్థమై గంగకుఁ బోవుచుంటిని. బాలరాముఁడు చలపట్టి నా వెంటవచ్చెను. సరి యని కూడఁ బిలుచుకొనిపోయితినిగాని నీళ్లలో దూఁకి యే వేళకు వెలుపలరాఁడు నేను వలదని యెంతబతిమాలుకొన్నను వినఁడు. అప్పుడు నేను గోపించి యాయనను నీళ్లలో నట్టె

యణఁగ నొత్తి యిఁక నెంతయూడెదవో యూడుమని యంటిని. అయ్యో యూపిరాడక తికమికలాడుచుండఁ గంటిని. నా చేతకు నేనే పశ్చాత్తాపపడి చేతులలో నెత్తుకొంటిని. మఱియొక విషయము నా కింతకంటె నెక్కుడుపరితాపము కలిగించెను దానికై గాఢముగ శోకించితిని. నా యొద్ద లేనిదేదో తెమ్మని బాలరాముఁడు పోరుపెట్టెను. ఆయనను మఱపింపఁగోరి పొట్టుపోని పేలాలు కొన్ని పెట్టితిని. వానిని బాలరాముఁడు నమలి తినుచుండఁగ నాయన లేఁతనాలుక గీఁచుకొనఁ గంటిని. ఇది నాకు సహింపరానిదయ్యెను. వెంటనే యొడిలోఁ జేర్చి 'నాయనా! తల్లి కౌసల్య నీకు వెన్నజున్ను పెట్టి యెంతో జాగ్రత్తగాఁ బోషించెను. నే నాలోచనము లేక యింతటి గఱుకుపదార్థము లిచ్చితినని యేడ్చితిని"

అని యీ ప్రకారము రామకృష్ణపరమహంసగారు తమ యనుభవమును శిష్యులకుఁ జెప్పిరి. ఈ బాలరాము లోహవిగ్రహము నేఁటికిని కాళికాలయమునందుఁ జూడవచ్చును. విగ్రహారాధనము ద్వేషించువారు దీనికిని రుక్మిణీపాండురంగమూర్తులు కన్నీరుకార్చుటకు నేమి చెప్పెదరో. ఇవి యేకాలమునాఁడో జరగినవి కావుకదా. భగవంతుని గన్నులారఁ జూచి యానందింపవలయుననిన భక్తియొక్కటే సాధనము. భగవంతుని భూలోకమున నవతరింపఁజేయ భక్తులే భక్తురాండ్రే సమర్థులు. మీఁదఁ జెప్పినట్టు బహిర్త్యాగనిష్ఠ లేక యంతర్త్యాగనిష్ఠ కుదురదు. ముందు తననీడ నేలపైఁ జూడక ఛాయాపురుషు నెవ్వఁ

డైనఁ జూడఁగలఁడా? భగవంతునకు రామకృష్ణ పరమహంస గారియందు స్నేహము మనయందు ద్వేషము లేదు. అంతటి భక్తి యెవరియందుండునో వారితో నెల్ల నట్లే భగవంతుఁ డాడును పాడును. ప్రీతిగలవారితో నేకదా మనమైనఁ గలసి వర్తింతుము. ఇందు నతియొక్క విశేషము. తొలుత షట్చక్ర శోధనము ముద్రలు మొదలైనవి చేసి యోగసిద్ధుఁడై చాలించి యా పిమ్మట భక్తిమార్గమున వర్తించి రామకృష్ణ పరమహంస భక్తిపరవశుఁడై భగవంతు వశపఱుచుకొనెను. అంతియ కాదు. ఆయన యుపదేశవాక్యములఁ వినుఁడు.

"For this iron age (Kaliyuga) it is communion with god by love, devotion and self surrender, as practised by the Rishi Narada that is most suitable." Words of the Master.

A certain Brahmachari named Ramachendra one day visited Sri Rama Krishna at the temple of Dakshineswar The aspirant had allowed his hair to grow into long matted tresses after the way of Sanyasins. Having taken his seat he began to exclaim from time to time 'Sivoham' 'Sivoham' but was dumb otherwise. Sri Ramakrishna observed him silently for sometime and then remarked, "what is the good of merely repeating the word 'Sivoham'? It is only when one, by perfect meditation on the lord in the temple of one's heart, has lost all idea of self and realised the Lord Shiva within, that one is entitled to utter this sacred word. What good can the mere repitition

of the formula do without the realisation? So long as the stage of realisation is not reached, it is better to regard the Lord as the Master and oneself as His humble servant" The aspirant came to see his mistake and became wiser by this advice and other similar teachings. Before he left the place, he wrote down on the wall of Sri Rāma Krishna's room. "Taught by the Swami from this day forwards Ramachandra Brahmachari regards the Lord as his Master and himself as His humble servant." Words of the Master.

"Om! Om! Om!—Mother, what is this I am saying! O mother, do not plunge me in the Knowledge of Brahman and take away my conciousness! Do not give me Brahmagnana; I am but thy child, I have fears and anxieties! I do want my mother! Thousand salutations to Brahmagnana! Give it to him who wants it, O mother, Ananda mayee oh mother Blessful!" దీనికిఁ దెలుఁగు.

ఈ కలికాలమున నారదమహర్షివలెఁ ప్రేమ భక్తి యాత్మనిక్షేపము భరన్యాసము, వలన భగవత్సాయుజ్యమునకు యత్నించుటే మిక్కిలి యుక్తమైనది.

రామచంద్రబ్రహ్మచారి యనువాఁ డొకఁడు దక్షిణేశ్వరాలయమున రామకృష్ణ పరమహంసగారియొద్దకు వచ్చి కూర్చుండి యెడపాపడపా శివోహం శివోహ మనుచుండెను. అది తప్ప మఱి యేమాటయు నాడినవాఁడు కాఁడు. రామకృష్ణ పరమహంసగారు కొంతకాల మూరక వినుచుండి తరువాత

వానితో నిట్లనిరి. "శివోహమ్మని యూరక వల్లించిన నేమిమేలు కలదు. ఎవ్వఁడు తీవ్రధ్యానమున హృదయముననుండు భగవంతునియందు నచంచలస్థితి మనస్సు నిలిపి తన్నుఁ దాను బూర్ణముగ మఱచిపోయి భగవంతుని సాక్షాత్కరింపఁజేసికొనునో యట్టివాఁ డా దశయం దా మాట చెప్ప నర్హుఁడు. సాక్షాత్కారము లేక మాటలుమాత్రము చెప్పిననేమి ప్రయోజనము. ఎంతవఱకు సాక్షాత్కారము లేదో యంతవఱకు భగవంతుఁడు స్వామియని తాను విధేయతగల దాసుఁడని భావించుటయే మేలు. అని బోధింపఁగా నా బ్రహ్మచారి తెలివితెచ్చుకొని తన పొరపాటు గ్రహించి యా గదివిడిచి పోవుచు వెలుపలిగోడపై "స్వామిచే బోధింపఁబడి రామచంద్రబ్రహ్మచారి తానుదాసుఁడని భగవంతుఁడు స్వామియనియిఁక భావించు"నని వ్రాసిపోయెను.

"ఓమ్! ఓమ్! ఓమ్! తల్లీ నేనేమంటిని! అమ్మా నన్ను బ్రహ్మజ్ఞానమున ముంచి నా స్మృతి నపహరింపకుము. నాకు బ్రహ్మజ్ఞాన మీయకుము. నేను నీ బిడ్డను. నాకు భయము విచారములు గలవు. నాకుఁ గావలసినది తల్లిమాత్రమే బ్రహ్మజ్ఞానమునకు సహస్ర నమస్కారములు. తల్లీ యానందమయీ! దానిని గోరువానికి దాని నిమ్ము".

అని యీ ప్రకారము బ్రహ్మజ్ఞాన మీ కాలమున కర్హమైనదికాదనియు భక్తియే యర్హమైనదనియు రామకృష్ణ పరమహంస యంతటివారు శిష్యులకు బోధించి తాము నట్లే యాచ

రించిరి. యోగసాధనములనన్నిట సిద్ధిపొంది నిర్వికల్పసమాధి సాధించినవారే యీ ప్రకారము బోధించియుండఁ దక్కినవారి మాటయేల. ఈ కాలస్థితి తెలియకయా ఋషీశ్వరులు కలౌ సంకీర్త్య కేశవమ్మనియు, నామస్మరణా దన్యోపాయః నహిపశ్యా మస్తరణోపాయ యనియు నిత్యాది సంస్కృతవాక్యంబుల వచించిరి. ఆత్మసాక్షాత్కారము లేక యద్వైతానుసంధానము చేయువాఁడు మూఢుఁడగునని భాగవతంబునఁ గలదు. ఆత్మ తెలియని యోగి కద్వైతములు మెండుగదా.

ఇది వాస్తవముగ సంసారమునుండి తరింపఁగోరువారి యభిప్రాయము మార్గము. అపరోక్షానుభూతి నిర్వికల్పసమాధి సిద్ధిలేక అహంబ్రహ్మాస్మి శివోహమ్మని వాగ్వ్యయము చేయు పరాత్మవంచకుల విషయమున శ్రీ శంకరాచార్యులవారు చెప్పిన వాక్యముల ననువదించినఁ జాలును. ఆ మహాత్ములు రామచంద్ర బ్రహ్మచారివలె వీరు బుద్ధిమంతులగుదురని నేను నమ్మను గాని వీరిమాటలు నమ్మి మోసపోవువారైనఁ గన్నులు తెరచి కొని వర్తింతురని నమ్మెన.

శ్లో. నగచ్ఛతి వినా పానం, వ్యాధిరౌషధ శబ్దతః
వినాపరోక్షానుభవం, బ్రహ్మశబ్దైర్నముచ్యతే.

ఔషధము తీసికొనక మందు మందని యుచ్చరించినంతనే రోగము శమింపదు. అట్లులే ప్రత్యక్షానుభవములేక యహంబ్రహ్మామనినంతనే ముక్తుఁడు గాఁడు.

## దేవాలయతత్త్వ౯

శ్లో. అకృత్వా దృశ్యవిలయ, మజ్ఞ
బ్రహ్మశబ్దైఃకుతో ముక్తిః, ఉక్తి మా

సమాధియందు దృశ్యమును లయింప
యథార్థస్వరూపము తెలిసికొనక యహంబ్ర -
ముక్తి యెందుండివచ్చును? అట్టి మనుష్యులకు ః
ఫలము.

శ్లో. అకృత్వా శత్రుసంహార, మగత్వాఖిల భూశ్రియమ్
రాజాహ మితి శబ్దా న్నో, రాజా భవితు మర్హతి.

పగవారిని జయింపక సమస్తభూలక్ష్మిని బొందక నేను రాజు నని పలికినంతనే యట్టివాఁడు రాజు కాఁజాలఁడు. ఈ కాలమునఁ గొందఱు శిశ్నోదర పరాయణులైన వంచకులు వేదాంతులమని యోగులమని బయలుదేఱి "నేనేబ్రహ్మము. నేనేల దానము ధర్మము చేయవలయును. నే నొకరికేల మ్రొక్కవలయును. దేవాలయము లేల? విగ్రహము లేల? అవియన్నియుఁ పాంచభౌతికములు. నేను శుద్ధబ్రహ్మమును. నేను భూతములకు మ్రొక్కవచ్చునా? మగఁడెవఁడు పెండ్లామెవతె! అందఱు బ్రహ్మమే. అంతయు నైక్యమే భేదభావము ద్వైతము. అది నరక కారణము" అని పెట్టికూఁతలు కూయుచు వీ రేమో గొప్పవారను భ్రాంతిచేఁ జూడవచ్చిన స్త్రీలఁ జెఱుచుచు, మన దేశమునిడబ్బులాగికొనుచు బిడాలవ్రతులై చరించుచున్నారు. వీరు బ్రహ్మమే యైనచో వీరి కాఁకలి దప్పి నిద్ర భయము [illegible].

నము లోనగు వేటికో. బ్రహ్మమున కివి యన్నియుఁ గలవు కాఁబోలు. బ్రహ్మము దొంగతనముగాఁ దిండి తినవచ్చునుగాఁబోలు. స్త్రీలను జెఱుపవచ్చునుగాఁబోలు. పరస్త్రీలను బరధనమును వంచనచే హరించుటయందు నద్వైతమే కాని తమ మీఁది గుడ్డను మఱియొకరు హరించినను దమ్ము నెవ్వరైనఁ జెప్పుతోఁ గొట్టినను ద్వైతమే, మఱుజన్మంబున వీరికి శుష్క దారిద్ర్యమేగతి, శుష్కబ్రహ్మములకుఁ బరస్త్రీలవిషయములో నద్వైతమేకాని స్వస్త్రీ విషయములో ద్వైతమే కాఁబోలు. పరులసొత్తు తాము పహరించుటయందు నద్వైతమే కాని తమసొత్తును బరులు హరించినద్వైతమే శరణము. బ్రాహ్మణ బ్రహ్మములకుఁ గల్లుసారాయి మాంసముక్కలు లేవుగాని ద్విజేతర బ్రహ్మముల కవియును వలయును. వీరి మూలమున నివియన్నియుఁ గడుపారఁ దినవచ్చునని వీరియొద్ద శిష్యులు చేరి వారియందు మాహాత్మ్యములు గల్పించి తెలివిమాలిన వారికిఁ జెప్పుచు వారివలన ధనము గ్రహించి జీవించుచున్నారు.

ఈ మహాత్ములు ౨౫-౦-౦ లకు బిడ్డలు పుట్టించెదమని, ౧౫-౦-౦ లకు దయ్యాలను బాఱఁదోలెదమని ౨౫-౦-౦ లకుఁ గాలిని నడపించెదమని ప్రకటించి లోకుల భ్రమింపఁజేయుచున్నారు. దగ్గఱఁజేరిన శిష్యులో వీరికి నెనుబదిసంవత్సరముల వయస్సు యోగబలముచే నలువదిసంవత్సరముల వారివలె నున్నారు. బదరికాశ్రమములోఁ బదిరెండుసంవత్సరములు తపస్సుచేసి వచ్చినారు. రెండుమిళ్లలు నెయ్యి యాహారముగఁగొని

యెన్నాళ్లైననుందురు. అని యిట్టిమాహాత్మ్యములు. కల్పించుచు లోలోపలఁ గావలసినంత తిండిపెట్టి మేపుచుందురు.

అద్వైతము దూష్యముగాదు. దాని స్థాపించిన శంకరాచార్యులవారును శుష్కవేదాంతులుగారు. వారు స్పష్టముగ "కర్మాద్వైతం నకర్తవ్యం, భావాద్వైతం సదాకురు" అనియు, జీవాత్మ పరమాత్మల కభేదమైనను నాయభేదము సముద్రము దానితరంగము, సూర్యుఁడు కిరణము, వంటిదనివారు స్పష్టముగఁ జెప్పియేయున్నారు.

శ్లో. సత్యపిభేదాపగమే, నాథతవాస్మినచ మామకీన త్వమ్
సాముద్రోహితరంగః, క్వచనసముద్రోన తారంగః.

కొందఱు త్రాగుపోతుతనమున సారాయమునురామానుజాచార్యులవా రంగీకరించినట్లు చెప్పునట్లే శుష్కవేదాంతులు కొందఱు శంకరాచార్యుల వారిపేరు చెఱుచుచున్నారు. జగన్మిథ్యయనునది పరమార్థ దశయందేకాని వ్యావహారిక దశయందుఁగాదనియు, నింద్రజాలికునకు నింద్రజాలమువలె భగవంతునకుఁ బ్రపంచ మసత్య మగునేకాని మనకుఁగాదనియు బోధించియే యున్నారు.

శంకరులు డుకృఙ్కరణేయని వల్లించువైయాకరణుఁగాంచి భజగోవిందమని బోధించిరిగాని యహంబ్రహ్మాయని బోధింపలేదు. ఆపత్కాలమునందు లక్ష్మీనృసింహా మమ దేహికరావలంబమని స్మరించిరిగాని నేను బ్రహ్మాయని స్మరింపలేదు. శంకరాచార్యుల

వారును విగ్రహముల నారాధించిరిగాని వానిని దూషింపలేదు. వ్యర్థమని చెప్పను లేదు. ప్రొఫెసరు కే. సుందరరామయ్య ఎం. ఎ. గారు రామానుజాచార్యులవారి విషయమున నిచ్చిన యుపన్యాసములో "All adwaitins are practically vishistadwitins" అద్వైతులందఱు నా చరణమందు విశిష్టాద్వైతులే యని వచించిరి. ఇది విజ్ఞులలక్షణము. శంకరాచార్యులవారు "అవినయమపనయవిష్ణో" యను శ్రీ మహావిష్ణుస్తోత్రమునందు మీఁద నుదహరించిన సత్యపిభేదాపగమేయని చెప్పి పదపడి

శ్లో. నారాయణ కరుణాలయ, శరణం కరవాణి తావకౌ చరణౌ
ఇతి షట్పదీ మదీయే, హృదయసరోజే సదా వసతు"

యని వచించిరి.

ఈ షట్పది విశిష్టాద్వైతుల "షట్పదోయంద్వ్యఖండః" యను న్యాయార్థమును సూచించుటలేదా. శైవమంత్రములందుఁగాని వైష్ణవమంత్రములందుఁగాని ప్రణవము లేని మంత్రములు గలవుగాని నమశ్శబ్దము లేని మంత్రము లేదు. ఇది దాసోహంభావమును సూచించుటలేదా.

పరపురుష వాంఛగల సతులును, మద్యమాంస రతులును శుష్క-వేదాంతులకు శిష్యులు గానిండు. మానము శీలము కులగౌరవము హీనియం దభిమానముగల స్త్రీలును నిజమైన తరణోపాయము నెఱుఁగఁగోరు స్త్రీ పురుషులును వీరిని దేళ్లను బాములను జూచినట్లు చూడవలయును. ఏమాత్రమైన దేహాభిమాన ధన కాంక్షలు గలవారును, శిశ్నోదర పరాయణు

లును, రాజసతామసాహారములను గాని సాత్త్వికాహారమైనను నెనిమిదికబళములకు మించిగాని భుజించువారును నేనే బ్రహ్మమని నదరి లేని తనుక్షేమము గోరువారు వీరిని దొంగలుగను, వంచకులుగను ఘాతుకమృగములుగను జూడవలయును.

విక్రయమునకు సిద్ధముగనుండు విగ్రహములు పూజకుఁ బనికిరావు. ఆ నిమిత్తమై శిల్పిచేతఁ బ్రత్యేకముగఁ జేయింప వలయును. ఈ శిల్పి శుచిర్భూతుఁడై భోజనమునకుఁ బూర్వ మేకాంతస్థలమునందుండి భగవంతుని దాను సాక్షాత్కరింపఁ జేసికొనుచున్నానను తలంపుతోఁ దదేక ధ్యాననిష్ఠుఁడై పనిచేయ వలయును. ధ్యానయోగమున నిది యుత్తమపక్షమని శిల్పాచార్యుల యభిప్రాయము.

శ్లో. ధ్యానయోగస్య సంసిద్ధ్యా, ప్రతిమాలక్షణం స్మృతమ్
ప్రతిమాకారకో మర్త్యో, యథా ధ్యానరతోభవేత్
నాద్యేన మార్గేణ, ప్రత్యక్షేణాపివా ఖలు
దేవానాం ప్రతిబింబాని, కుర్యాచ్ఛ్రేయస్కరాణిచ
స్వర్గ్యాణి, మానవాదీనా, మస్వర్గ్యాణ్యశుభానిచ.

శ్లో. అపి శ్రేయస్కరం నౄణాం, దేవబింబ విలక్షణమ్
సలక్షణం మర్త్యబింబం, నహి శ్రేయస్కరం సదా.

అని శుక్రాచార్యులు వచించిరి. దీనివలన సలక్షణమ జప్రతిమకన్న లక్షణదోషము గలదైనను దేవతాప్రతిమ శ్రే స్కరమనియు నేర్పడెనుగదా. పూజావిగ్రహములు దేవ

వముతోనే జనించును. దేవభావముతోనే పూజింపఁబడును. ఇట్టి ప్రతిమలయందు భగవంతుఁడు తానే ప్రవేశించునని శ్రుతులు చెప్పుచున్నవి.

"అహంసన్నిహితస్తత్ర, పాషాణ ప్రతిమాదిషు" అని రామోత్తర తాపనీయోపనిషత్తునందుఁగలదు.

"In the lower stages of meditation the setting aside of material images should not be attempted before the soul is very far advanced, as it is clear that till then it ought to seek the creator by means of creatures, To do otherwise is to act as if were angels." అని థెరిసె యను పాశ్చాత్యజ్ఞానియు బోధించెను. ✓ 24. 3. 1958

## దేవాలయములవలని లాభములు.

నేను రామభిక్షుకై పోయినసమయంబున బళ్లారిలో నొక పెద్దమనుష్యుఁడు సత్త్రముఁ గట్టింపుము తీర్థముఁ జక్కఁ జేయింపుము, దేవాలయమును జక్కఁజేయింపకుమని బోధించి యీ ాంపీ దేవాలయము లెట్లు పాడుపడియున్నవో చూడుమని ప్పెను. దేవాలయములు బాగున్నంతవఱకు దేశము బా ఁండెనని యు నవి చెడుటతో నిదియుఁ జెడెననియుఁ జెప్పితిని. దేవాలయములు దేశమునకు హానికరములా క్షేమకరములా యాలోచింతము.

దేవాలయము మంచిస్థితియం దుండుటకు గ్రామమైనను సిరిగల నాలుగు చదంపువీథులైనఁ గలవై చూచుటకు రమ్యమై

యుండును. త్రిసంధ్యములందు మంగళవాద్యములు శ్రవణసుఖకరములై యానందదాయకములై మనోగ్రాహకములై భగవత్స్మరణ కారణములై పాపాపహములై వలదన్నను వినవచ్చును. దానివలన విను వారిమనస్సు భగవంతునిపైఁ బోవును.

౨. ఉత్సవములందు వీథులవెంట స్వామి వేంచేసినపుడు బలాత్కారముగనైన దర్శన స్మరణములు లభించుటయు నమస్కరించుటయుఁ గాయకర్పూరముల రూపమున నిష్కామముగ మనద్రవ్యము స్వామికని సమర్పించుటయుఁ గలుగును. ఇది సాత్త్వికత్యాగముగదా. ఈ మాత్రముననే యెంతో మేలు గలదు. పత్రముగాని పుష్పముగాని ఫలముగాని నీళ్లుగాని భక్తితో నిచ్చినయెడల సంతోషముతో భుజింతు ననిన భగవంతుఁడు టెంకాయలో పండ్లో భక్తితో నిచ్చిన నెంత సంతసింపఁడు? భగవంతుఁడు సంతసించుటకంటెఁ గావలసిన దేమున్నది?

శ్లో. అణ్వప్యుపహృతం భక్తైః ప్రేమభోగాయ జాయతే
భూర్యప్యభక్తోపహృతం, న మేభోగాయ జాయతే.

భక్తులు నాకు సమర్పించునది కొంచెమైనను నాకు భోగమునకు యోగ్యమగుచున్నది. భక్తిలేనివారు విశేషము నిచ్చినను నాకు భోగ యోగ్యముగాదు. అని భగవంతుఁ చెప్పెను. దీనివలన భక్తిమార్గ మెంతసుకరమో తెలియఁగలదు

3. ఉత్సవకాలంబులందు వీథులు రంగవల్లులు కేఁ పరిశుద్ధములై యారోగ్య హేతువులై నేత్రానంద కరము

లందఱకు మాన్యములున్నవి. ఇవియన్నియు నన్యాక్రాంతములై పోవును. అతిథుల కభ్యాగతులకుఁ బరదేసులకు బేద సాదులకు నశనసుభావమగును. దాతల యుద్దిష్టధర్మము చెడును దేవస్వము దిను రైతులు వంశనాశమై పోదురు. బేదసాదల నోటికడిఁ దీసినట్లగును. దేవతాస్మరణము కైంకర్యము మఱపు చెందును. క్రైస్తవులవలెఁగాక సర్వావస్థల సర్వకాలముల మనకు భగవచ్చింతన మావశ్యకము దాని కివి సహాకారులు. ధర్మము, సత్యము, భక్తి చెడునపుడు వానిని నిలఁబెట్టుట బాగా? ఏ నాఁడో యవి చెడునని మన మిప్పుడే చెఱుచుట బాగా? మనుష్యుఁ డెప్పుడైనఁ జచ్చువాఁడేయని రోగమువచ్చినపుడు మందులియ్యక చంపవలయునా?

## దేవాలయ పునరుద్ధరణకార్య మసమంజసమా.

ఇఁక నా కీ కార్యము సమంజసము కాదను హితబోధకులకు సమాధానము చెప్పవలసియున్నది. వీరు నాయందలి గౌరవబుద్ధితో నా యోగ్యతకుఁ దగనికార్యముఁ జేయుచున్నానని వాస్తవముగఁ దలఁచి హిత ముపదేశించుటచే వీరు నాకు వంద్యులే యగుదురుగాని వారి యభిప్రాయమున నే నే కీభవింపఁజాల. అభిప్రాయభేదమునకు నన్ను వారు క్షమింతురుగాక. వీరి యభిప్రాయప్రకారము నా యోగ్యత యుత్తమమని దేవాలయోద్ధరణకార్యము జఘన్యమని యేర్పడుచున్నది. నన్ను వీరు కర్మయోగిగ నెంచినను, జ్ఞానయోగిగ నెంచినను, భక్తియోగిగ నెంచినను, బ్రపన్నునిగ నెంచినను నేను జేయునది యీ కార్యము

గాదు. ఆత్మోపకారకము లోకోపకారకము నగుటచే ననా వశ్యకమును గాదు. ఇంతకు నిది నా యుద్దిష్టమునుగాదు. భగవదాజ్ఞ శిరసావహించి జరపుచున్నాఁడను. నావలనఁ దన కార్యమెంత యిచ్చట జరుగవలయునని యాయన సంకల్పమో యంతే జరగునుగాని యావల నేనెంత శ్రమించినను గృష్ణనిర్యాణానంతరమందలి యర్జునుఁడనే యగుదును. భగవంతుఁడు నన్నుకార్యమందు నియమింపఁడని యెఱుఁగుదును. ఈ కార్యము పూనినతరువాత నితరమార్గ సాధ్యముగాని కొన్ని సాధనముల నిందు సాధించుట కనువుపడినది. నేను జేయుకార్యమందు దేవసేవ ముఖ్యము. దేవసేవారూపమున లోకసేవయుఁ జేయుచున్నాఁడను. నే నారురుక్షుఁడనే కాని యారూఢుఁడను గాను. ఆరూఢునకైనను నీ రెండుసేవలు గర్హ్యములా? గర్హ్యములుగామి యటుండ జనమధ్య సంచారియై యుండువఱకు నా రూఢునకైన నివి కర్తవ్యము లేయని నా యభిప్రాయము. ఈ యభిప్రాయమును నేను నా కృష్ణలీలామృతములోనగు వాని యందుఁ దెలిపియున్నాను. ఈ యభిప్రాయమునే నాకంటె గొప్పవారును జెప్పిరి.

"my creed is service of God; hence of humanity" నా మతము దేవసేవ కనుక నే మనుష్యసేవ. అని మహాత్ముఁడగు గాంధిగారు "we must stoop to conquer" అను శీర్షికగల వ్యాసమునందు వ్రాసిరని ఇది 1924 అక్టోబర్ 30 ది గల స్వరాజ్య పత్రిక ప్రకటించెను.

కం. భగవంతుం డిరు తెఱఁగుల
జగముగను దదాత్మగాఁగ సంశోభించున్
జగతీజన సేవావిధి
దిగవిడుచుట నీతిగాదు ధీమంతులకున్.

అను నా పద్యము నభిప్రాయమునకు నిది సరిపోవుచున్నది.

రామకృష్ణపరమహంస శిష్యప్రశిష్యు లిట్టి యభిప్రాయము నడవడిగలవారై యున్నారు. 1924 మార్చి నెల ప్రబుద్ధ భారతయం దిట్లు వ్రాయఁబడియున్నది.

"He (Swami Vivekananda) agreed that Chitha Suddhi or purifying the heart means the getting rid of selfishness, and so every act of selfless service is holy and pure. In consequence, works of famine relief, sanitary improvement, medical help, aid to the poor and educational activites were all taken up by the members of the order as so many forms of worship."

"In our country the old idea is, to sit in a cave and meditate and die. To go ahead of others in salvation is wrong. One must learn sooner or later that one cannot get salvation if one does not try to seek the salvation of his brothers. You must try to combine in your life immense idealism with immense practicality. You must be prepared to go into deep meditation now, and the next moment you must be ready to go and cultivate the fields. You must be prepared to explain the difficult intricacies of the Sastras now and the next moment to go and sell the products of the field in the market. You must be prepared for all menial services not only here but elsewhere also."

చిత్తశుద్ధియనఁగా స్వార్థపరత్వత్యాగము. కావున స్వప్రయోజనమునకుఁ గాఁ జేయని ప్రతి కార్యము దివ్యము పవిత్రము నైనదే. ఆ కారణముచే దుర్భిక్ష నివారణార్థమును, నారోగ్యాభివృద్ధికిని, నౌషధసాహాయ్యమునకును, బీదలకు సహాయపడుటకును, విద్యావిషయ క్రియలకును జేయు కార్యములన్నియు, నన్ని దేవతారాధనములని సన్న్యాసులు గ్రహింతురు. మన దేశమునఁ బూర్వాభిప్రాయ మేమనఁగా నొక గుహలోఁ గూర్చుండుట, ధ్యానించుట, చచ్చుట. తన తోడివారికింటెఁ దాను ముందు మోక్షమునకుఁ బోవుట తప్పు. త్వరగానో యాలస్యముగనో తన తోడివారు మోక్షమునకై పోనఁ దాను యత్నింపఁడేని తనకు మోక్షప్రాప్తి యసాధ్యమని తెలిసికొనవలయును. నీ జీవితమందు నీవు పరమజ్ఞానమును, బరమాచారమును మిశ్రముచేయవలయును. ఇప్పుడు నీవు గాఢధ్యానమున మునుఁగవలయును. ఉత్తరక్షణముననే పొలము దున్నుటకుఁ బోవలయును. ఇప్పుడు నీవు శాస్త్రమునందలి సందేహగ్రంథుల విచ్చి చెప్పవలయును. వెంటనే యంగడికిఁ బోయి నీ పొలములోఁ బండిన ధాన్యమును విక్రయింపవలయును. నీ విచ్చుటనేకాక తక్కిన స్థలములందును నెంత యధమమైనదయినను (బరోపకారముగ) సేవచేయఁ బోవలయును.

తా నొక్కఁడుమాత్రము ముక్తుఁడగుటకు యత్నించుట సరిగాదనియు, నట్లగుటకు సాధ్యముగాదనియుఁ జెప్పిన వివేకానందస్వాములవారిపై యభిప్రాయముతోఁ బూర్ణముగనే నేకీ

భవింపఁ జాలమికి వగచెదను. వ్యష్టిముక్తి సాధ్యముగాదేని యట్టు లయిరనిచెప్పు పురాణవాక్యము లసత్యములా? శ్రీ రామకృష్ణావతారమూర్తులు తమతోడ ననేకులఁ గొనిపోయిన మాట యటుండ నిచ్చినను మఱియెందఱో భగవద్ధ్యాన దర్శనాదుల ముక్తులయిరిగదా. ఈ విషయమునఁ బెద్దలవలన నొక రహస్యము గ్రహించితిని.

ఒకఁడు ధనార్జనము నిమిత్తమై యేటియొద్దను నిలఁబడి యా యేటిని దాఁటుకుతుకముగలిగి వచ్చినవారినిఁగని నే నీ యేఱు దాఁటించెదను. నన్ను నమ్ముకొనిరండు. ఈఁతలాడుచుఁ గొనిపోయెదను. ఈఁతయనఁగా నెంతమాత్రము? కాళ్లిట్లు కొట్టవలె చేతులట్లు కొట్టవలె. ఇంతేయని యీఁతలాడు విధము నుపన్యసించుచుఁ దనకది యేమియు నభ్యాసమునఁ దెలియమిచేఁ దాను మునిఁగి తన్ను నమ్మివచ్చిన వారలను ముంచును ఈ కాలపు శుష్కవేదాంతులయు వారిశిష్యులయుగతి యిట్టిగును. మఱియొకఁ డభ్యసించి యీఁదనేర్చి తక్కినవారితో జెప్పకయే తటాలున నీటఁబడి యీఁదుచు నావలియొడ్డు చేరవాఁడు. వీఁడు వనములలో గుహలలోనుండి తపస్సుచేసి వాడుమాత్రము తరించువాఁడు. వీఁడు కేవల బద్ధజీవుఁడు. మఱి కొందఱు పడవలవంటివారు. వీరును బద్ధజీవులయినను భగత్కళ వీరియందావేశించియుండుటచేఁ దామునుమాత్రము తరిచుటతోఁ దృప్తినొందక తమతోడ మఱికొందఱను శక్త్యనుసరము తీసికొనిపోవువారు. నాలుగవవారు పెద్ద పొగనోడఁ

వంటివారు. వీరు వేలకొలఁది జీవులఁ దరింపఁజేయుదురు వీ రవతారమూర్తులు.

Swami Vivekananda. స్వామి వివేకానందులు.

"If you succeed in the attempt to throw off your religion and take up either politics or society or any other thing as your centre, as the vitality of your national life, the result will be that you will become extinct......So in India social reform has to be preached by showing how much more spiritual a life the new system will bring; and politics has to be preached by showing how much it will improve the one thing that the nation wants—its spirituality". Swami Vivekananda. దీనికిఁ దెనుఁగు.

నీవు మతమును బాఱఁద్రోచి రాజ్యాంగతంత్రమునకుఁ గాని జనసంఘమునకుఁగాని మఱి దేనికిఁగాని సంబంధించినవి ముఖ్యములుగను, నీ జాతీయ జీవితమునకుఁ బ్రాణపదములుగాను, గ్రహించుట యందు విజయము చెందితివా నీవు రూపుమాసి శూన్యమైపోవుటయే ఫలము. కావున హిందూదేశమందు సంఘసంస్కారమును బోధించువా రిప్పటికంటె నూతనపద్ధతి వలన నొకఁడు తన జీవితమం దెంత యాత్మజ్ఞాన మాచరణమునకుఁ దెచ్చుకొనఁగలఁడో నిదర్శన పూర్వకముగఁ దెలియఁ జెప్పవలయును. అట్టులే రాజ్యతంత్ర మెంతమాత్రము దేశమున వారికి ముఖ్యముగఁ గావలసిన దొకటియే యగు నాత్మజ్ఞానము వృద్ధిచేయునో తెలుపుచు దానిని బోధింపవలయును.

శ్లో. “మయ్యేవ మన ఆధత్స్వ, మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ, అత ఊర్ధ్వం నసంశయః॥
అథ చిత్తం సమాధాతుం, న శక్నోషి మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో, మామిచ్ఛాప్తుం ధనంజయ
అభ్యాసే ప్యసమర్థోసి, మత్కర్మపరమో భవ
మదర్థ మపి కర్మాణి, కుర్వన్ సిద్ధి మవాప్స్యసి॥
అథైతదప్యశక్తోసి, కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మఫలత్యాగం, తతఃకురు యతాత్మవాన్॥భగవ.౧.

ద్వి.........నిచ్చలు నాయందె నిలుపు మనంబు
నాయందె నిలుపు మనయమును బుద్ధి,
బాయక యింకమీఁదఁ బార్థ! నాయందె
నిలువంగఁ గలవిది నిక్కంబునుమ్ము,
వలదు సందేహంబు వాసవతనయ;
స్థిరముగ నాయందుఁ జిత్తంబు నిలుప
నరగను నీకు నీవు శక్తిలేదేని
యటుమీఁదఁ గోరుమా యభ్యాసయోగ
పటిమ చేనైనను బ్రాపింపనన్ను.
అలవిగా దేనియు నభ్యాసమైనఁ,
జలుపుము నాకర్మచయమె ముఖ్యముగ
నా కొఱకై చేసినను గర్మములను,
బ్రాకటంబుగసిద్ధిఁ బ్రాపింపఁ గలవు.
ఇఁక దీనిఁ జేయలేవేని నా యోగ

మకలంకమతి నాశ్రయంబును బొంది,
యటమీఁద నియమించి యంతఃకరణము,
పటు కర్మఫలకాంక్ష వదలు మంతయును. ద్వి. భ.

వివేకానందస్వాములవారి యభిప్రాయము మీఁది భగ
వద్గీతా వాక్యముల ననుసరించి యున్నవి. నాకివియే ప్రమాణ
ములు. గాంధిమహాత్ముఁడును రామకృష్ణపరమహంస మతసన్న్యా
సులును నాలుగవ శ్లోకమునఁ జెప్పఁబడినట్లు చేయుచున్నారు.
మూఁడవ శ్లోకమునఁ జెప్పఁబడినట్లు నేను జేయుచున్నాను. ఈ
యర్థమునే నా కైంకర్య భిక్షాపత్రమందలి

సీ. అభ్యాసయోగాప్తికై హరికైంకర్య
కార్యంబునకు నిట్లు కడఁగినాఁడ.

తే. నీవతెనె నీదుదాసుండు నీదుసేవ
భక్తి దిటపడ లోకులు బాగుపడఁగ
భిక్షమెత్తినఁ, బస్తున్నఁ బీడపడినఁ
బ్రాణ మిచ్చినఁ దప్పేమి రామభద్ర.

యీ వాక్యములఁ దొలుతనే విన్నవించుకొన్నాఁడను.

## నిరాకారునకు నాకారకల్పనము దోషమా.

నిరాకారుఁడైన భగవంతునకు నాకారకల్పనము దోష
మని కొందఱు తలంతురు. నిరాకారుఁడనఁగా నేమి? శూన్య
మని యర్థమా? శూన్యునకు సద్భావ మెన్నఁడైనఁ గలుగునా?
లేనిదెన్నఁటికి లేనిదే. ఏమియు లేనిదే. భగవంతుఁడు నిరాకా

రుఁడైనచో వటపత్రశాయి యెవరు? నిరాకారుఁడు నిర్గుణుఁ
ధ్యానించిన గజేంద్రునకు భగవంతుఁడు సాకారుఁడై యె
కానవచ్చెను? ప్రహ్లాదు నిమిత్తమై నరసింహాకృతితో సమస్త ప
ర్థములందు నెట్లుండఁ గలిగెను?

నిరాకారుఁడనఁగా మనకు నిర్దిష్టమైన యాకారమునఁ
యేకవిధమైన యాకారముకలవాఁడు గాఁడనియు స్వేచ్ఛా
రూపరూప ప్రవృత్తులు గలవాఁడనియు నర్థము. ఉదాహ
ము. శుద్ధమైన యూవిరికేది రూపము? అది కనులకుఁ గా
చ్చునా? ఈ యూవిరియేకదా లోకోపకారార్థము జలమగు
న్నది. ఇదియేకదా మంచుగడ్డయగుచున్నది. అట్టులే భగ
తుఁడు స్వసంకల్పిత కార్యాను రూపముగ నిరాకారుఁడగు
సాకారుఁడగును. భగవంతుఁడే తన కాయాకారమును గల్పిం
కొనెనుగాని మనము సంఘటింపఁ జేయలేదు ఆయన కర్తబ
డునుగాఁడు ఈ యర్థమునే శ్రీ భాగవతమందలి యీ పద్య
విశదీకరించుచున్నది.

ఉ. సర్వఫల ప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వశక్తుఁడుఁ
సర్వజగత్ప్రసిద్ధుఁడును సర్వగతుండగు చక్రపాణి యీ
సర్వశరీరులుఁ నిగమసంగతిఁ జెంది విశీర్యమాణులై
పర్విన చో నభంబుగతి బ్రహ్మము దాఁజెడకుండు నెప్పుడు!

ఇందలి విశేషణముల సారస్యమును బుద్ధిమంతు
గ్రహింపఁగలరు. బుద్ధిలేనివారి కెంతచెప్పిన నేమి ప్రయో

ము? నభమనునది పంచభూతములలోని జడమైన నభముగాదు.

ఈ విషయమై రామకృష్ణ పరమహంసగారును నీళ్లు చలిమిరిచే గడ్డకట్టినట్లు భగవంతుఁడు భక్తుల భక్త్యతిశయముచే వారిని సంతోషపెట్టుటకై సాకారుఁడగును. వేఁడిమికి మంచు గడ్డ నీరగునట్లు జ్ఞానుల జ్ఞానబలముచే నిరాకారుఁ డగును అని చెప్పిరి. తన యాశ్రితులకోరికలు దీర్చుట భగవంతునకు విధి. యా దృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ «యే యథామాం ప్రపద్యంతే తాంస్త థైవభజామ్యహా" మ్మనట్టు లెవరెవరి కోరిక లెట్లెట్లుండునో యట్లట్లే వారి వారికి క్రతున్యాయంబున గోచరించును. ఇందొక్కటి యెక్కువగాదు. వేఱొక్కటి తక్కువ గాదు. రామకృష్ణ పరమహంసగారి చరిత్రపుట ౨౭౯ యందిట్లు తనగురువునకు రామకృష్ణ పరమహంస బోధించెనని చెప్పఁబడెను. సృష్టి స్థితిలయకార్యములు చేయ నప్పుడు భగవంతుని నేను నిరాకారుఁడు నిర్గుణుఁ డందును. అవి చేయు నపుడు సాకారుఁడు సగుణుఁడందును. పాలకు దాని తెలుపునకు భేదములేనట్లు సాకార బ్రహ్మమునకు నిరాకార బ్రహ్మమునకు భేదము లేదు. పాలు మనస్సునకు వచ్చినపుడు తెలుపు రానే వచ్చును. అట్టులే రత్నము దానికాంతి. సాకారమంతయు సగుణమే. సగుణమంతయు సాకారమే. భగవంతునియందు సాకార నిరాకారభేద కల్పనము బుద్ధిహీనచిహ్నము. [మేలు కొలుపునందు నేను వ్రాసిన మహా నారాయణోప నిషద్వాక్యములఁ గనుఁడు.]

రామకృష్ణ పరమహంసగారి గురువు తోటపురిం నగ్నసన్యాసి నిర్వికల్పసమాధి సాధించినవాఁడు. భక్తివ మును నపహాసించువాఁడు. నిర్వికల్పసమాధిని సాధించిన వాతఁడు రామకృష్ణ పరమహంసగారు రామకృష్ణ గో యని చేతులఁ దాళము తట్టుచు భజనచేయఁగాఁ బూ తట్టెదవాయని యాయన యపహాసించెను. తరువాత శిష్యునే గురువుగాఁ జేసికొని కాళీ దేవ్యాలయమునకుఁ వుట యాయనతోఁడ నమస్కరించుట లోనగు భక్తుఁ చే చేయసాగెను. తరువాతఁ గాళియనుజ్ఞ తీసికొని వెడ లెను. వివేకముగలవారు దీని యర్థమును గ్రహింతురు. ఏ నియమము లెట్టివో యెఱుగక యానసమైన సాధంపక త యోగులమని జ్ఞానులమని ప్రేలెడువారు పరాత్మవంచకులై గతి పట్టెదురో.

శ్లో. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః, ప్రవదంతి న పండితాః
ఏకమప్యాస్థితస్సమ్య గుభయోర్విందతే ఫలమ్". భగ

అన్నట్లు బాహ్యాభ్యంతర పూజలకు భేదము న చెప్పుదురుగాని విజ్ఞులు చెప్పరు. ఈ రెంటిలో నుం దొక్కటిన జక్కఁగఁ జేయువానికి రెండును జేసిన ఫలముగలదు.

శ్లో "సాకారంచ నిరాకారం, నిర్గుణంచ గుణాత్మకమ్
తత్త్వం తత్పరమంబ్రహ్మ, ఇతి వేదాంత డిండిమః"

సాకారంబును నిరాకారంబును నిర్గుణంబును గు కము నగునది యేదో ఆ తత్త్వము పరబ్రహ్మమని వేద

డింపుము. శంకరుల యీ వాక్యములు మూఢుల కెట్లు ప్రమాణములు.

## సారాంశము.

౧. విగ్రహారాధనమునకుఁ బ్రమాణములు వేదములు దక్షిణాతీశుమునకు మూలభూతములైన యాగమములును. దీనికే బాహ్యపూజ యని బేరపూజయని పేరు.

౨. బాహ్యపూజ స్వయముగ భగవత్సాక్షాత్కారమును గలిగించుటేకాక యాభ్యంతరపూజ చేయువారికిని సహాయపడును.

3. బాహ్యాభ్యంతరపూజలు విధానఫలములం దభేదములు.

౪. భక్తిహీనమైన కేవల జ్ఞానము యోగములు వ్యర్థములు. భక్తి స్వతంత్రశక్తి గలది. కృష్ణలీలామృతము భక్తిప్రాశస్త్యము చూడుఁడు.

౫. కడపటిదశయందు భక్తి జ్ఞానము లభేదములు.

౬. యోగులందఱయందు భక్తియోగియే భగవత్ప్రియతముఁడు.

శ్లో. యోగినామపి సర్వేషాం, మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం, స మే యుక్తతమో మతః.
అని భగవ. ౬. ౪౭.

౭. భక్తివలన మోక్షమాజన్మమందుఁ దప్పిన మఱుజన్మమందైనఁ గలుగును. ప్రపత్తివలన నా జన్మమందే ముక్తిగలదు.

"తన కులధర్మముఁ విడిచి దానవవైరి పదారవిందముల్, ప వడి పూజచేసి పరిపాకమునొందక యెవ్వఁడేనిఁ జచ్చిన మఱి మేననైన నది సిద్ధివహించును." (శ్రీ భాగవతము) ఏతద్దేహా సానే మాంత్వే త్పాదం ప్రాపయుస్వహా" మ్మని ప్రపన్నుఁడనున బహూనాం జన్మనామంతే జ్ఞానవాఁ మాంప్రద్యతే" యె జ్ఞాని యనేక సహస్రజన్మములెత్తినఁగాని సిద్ధిపొందఁడు. భ యోగమునుగుఱించి చెప్పుచు శ్రీకృష్ణుఁడు

శ్లో. తేషామహం సముద్ధర్తా, మృత్యు సంసారసాగరాత్
భవామి నచిరాత్పార్థ. భగ. ౧౨. ౭.

యని నన్నుపాసించువారిని శీఘ్రముగా రక్షించెదననెను

౮. భక్తిసుసాధము. కేవలజ్ఞానము దుస్సాధము.

శ్లో. క్లేశోధకతరస్తేషా, మవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తాహి గతిర్దుఃఖం, దేహవద్భిరవాప్యతే.
భగవ. ౧౨. ౫.

౯. బాహ్యమందు మనస్సుదృష్టి నిలుపలేనివాఁ డంత మందు నిలిపెదననుట యుట్టికెక్కలేనమ్మ స్వర్గానికి నెక్కెదనఁ టువంటిది.

౧౦. అత్యంత భక్తియుక్తులై సర్వకాల సర్వావస్థలఁ ధ యులై భగవన్నామ ముచ్చరించుచు ధ్యానించువారికి నిర్వికఁ సమాధియం దుండువారికిఁ దప్పఁదక్కిన యందఱకు యోగు కైనను, జ్ఞానులకైనను, బాహ్యపూజ యావశ్యకము.

౧౧. భగవద్దర్శన జనితానందానుభవము భక్తియోగ మందే కాని యితరయోగంబుల లేదు. కైవల్యానందము భర్త్రు విరహిత స్త్రీ యొంటరిగ నింటిలో నొకమూలఁ గూర్చుండి తనసొగను దాను జూచుకొని యానందించుటవంటిది.

౧౨. భక్తి విరక్తులతోడి కర్మమునే భగవద్గీత బోధించునది.

భక్తి యుత్తమోత్తమత్వమును దెలియఁగోరువారు మదీయ శ్రీ కృష్ణావతారతత్త్వమును భక్తిప్రాశస్త్యమును బఠింపఁ బ్రార్థితులు.

౧౩. కేవల జ్ఞాననిష్ఠులైనను యోగులైనను జనుల నడుమ సంచరించువఱకుఁ దమకనావశ్యకములైనను గర్మములు చేయుచు జనులకుహితకరమార్గమునందే తాము వర్తింపవలయును. ఇతర విధముల శ్రద్ధాభక్తులతో భగవన్మార్గమం దుండువారి నాక్షేపింపరాదు. వారికి బుద్ధి భేదము జనింపఁజేయరాదు. ఇట్లు చేయువాఁడు వారిని జెఱిచి యా పాపమునఁ దాను జెడును.

౧౪. మానసికపూజవలన నభ్యంతరవాసనలు, బాహ్యపూజ్యవలన బాహ్యావాసనలు నశించును.

శ్లో. నిర్దదత్యంతరాన్సర్వా, మానసో యాగ ఉత్తమః
బాహ్యాశయ విశుద్ధ్యర్థం, బాహ్యయాగోవిధీయతే.
లక్ష్మీతంత్రము

శ్లో. బాహ్యోత్థవాసనావిప్ర, బహుజన్మార్జితాదృఢా
లాలీకృతోనయాహ్యాత్మా శుద్ధాశుద్ధస్వరూపయా

యా మంత్రవిషయాశుద్ధా, క్రియాశాంతస్వరూపః
సముత్థాన వినాశార్థం, తస్యాస్సం పరికీర్తితమ్
సబాహ్యాభ్యంతరాభ్యాంచ, క్రియాభ్యాంతస్యయోభవే
దృఢోత్థవాసనానాంచ, తానవం స్యాచ్ఛనైశ్శనైః
జయసంహిత.

౧౫. తో్రక్కుడుతాలు మొ్రక్కిడితాలు భగవన్మయః సాక్షాత్కారమువలనఁ గలిగిన యనుభవముచేఁ దెలిసిన వారలగు జ్ఞానులు దేవాలయములకుఁ బోకుండినను విగ్రహారాధనము చేయకుండినను దోషము లేదు. అట్టివారు న వారలైనచో లోకము నిమిత్తమైనఁ జేయవలయును.

౧౬. తో్రక్కుడుతాలు మొ్రక్కిడితాలు స్థూలప్రక్షమయ పాషాణములని యెంచు నజ్ఞానులు శుష్కవేదాంతు దేవాలయమునకుఁ బోక కుక్కలవలె గాడిదలవలె వెలుప నుండుటే మేలు.

౧౭. ఈ రెంటితెగలకు నడిమివారు భక్తితో దేవాలయమునకుఁ బోవుటచేతను విగ్రహారాధనము చేయుటచేతను గుపడుదురు. ఇహపర సుఖదాయకము భక్తియే. భక్తిహితవ ప్రథమసోపానము సూడుఁడు.

౧౮. విగ్రహారాధకులు సాక్షాద్భగవన్మూర్తిని బూజింమన్నారు. వారు చేయునది యప్రతీకోపాసనముగాని యత్పూజగాదు. అచిన్మిశ్ర పూజయును గాదు.

౧౯. పదునొకొండింద్రియములలో నొక మనసుచేఁ జేయు పూజ, శ్రేష్ఠము. మనసు, కన్నులు, చెవులు, నోరు-చేతులు, కాళ్లు, వీనియన్నిటితోను జేయు పూజ నీచ మెట్లయ్యెనో. ఒక యింద్రియముతో మనఃకల్పిత మిథ్యాపదార్థములతోఁ జేయు పూజకంటె ధ్యాన-దర్శన-శ్రవణ, పఠనార్చన నమస్కార దేవాలయ గమనాదులఁ ఫలతోయమిచ్చి బత్రం పుష్పం జేయు సేవ తక్కువయనువారి మతిహీనతకు వగవవలసియున్నది.

## దేవాలయ ప్రేక్షక హితచర్య.

ఆత్మసాక్షాత్కారముఁ గోరినయోగి యమనియమములనుష్ఠించుచుఁ, గామక్రోధలోభములకుఁ బాలుపడక యెట్లు మనోబుద్ధీంద్రియములను దేహమును బరిశుద్ధముగ నుంచుకొనవలయునో యట్లే భగవదనుగ్రహముకోరి దేవాలయమునకుఁ బోవువారును దేహేంద్రియ మనోబుద్ధులను బరిశుద్ధముగ నుంచుకొనియే పోవలయును. పాదప్రక్షాళనము చేసికొని దంతములసందున నంతకుముందు తినిన నమలినపదార్థముల తునుకలు లేకుండునట్లు పుక్కిలించివైచి యాచమించి లోపలఁ బోవలయును. దేవాలయము సమీపముననుండువారు తమ యిండ్లయందే యీ కార్యములు చేసికొని రావచ్చును. దూరపువారు దేవాలయ సమీపముననుండు బావిలోనో గుంటలోనో వంకలోనో పాదప్రక్షాళనాదులు సలిపియే పోవలయును. ఇట్లు పరిశుద్ధదేహులై భగవన్నామము నుచ్చరించుచు భగవంతునిపై మనస్సుంచి భగవత్కథలనుమాత్రమే చెప్పు

కొనుచు దేవాలయము ప్రవేశించి మగవారు తమమీఁది య
వస్త్రమును నడుమునకుఁ జుట్టుకొని, జాలు పైటల మిట్టా
వీథులూడ్చు పైటకొంగుల నడుమునఁ జెక్కి ధ్వజస్తంభమున
వారివారి సంప్రదాయానుసారముగ నొకటియో రెండో మ
డో పంచాంగ సాష్టాంగ నమస్కారములాచరించి యట్టి
దేవాలయప్రదక్షిణము సలిపి యావల దేవతాదర్శనమున
బోవలయును. దేవాలయములోఁ బ్రవేశించునపుడును,
దుండునపుడును కొన్ని యపచారములు చేయరాదని శా
ములు చెప్పుచున్నవి. ఈ యపచారములు కొన్ని దేవాలయ
దలి సత్తేజస్సును జెఱుచును. కొన్ని యపచారములు చే
వారికిఁ గీడు కలిగించును. సుగంధవస్తువుల పరిమళంబున వ
హారమై యారోగ్యకరమైన గదిలోకి నమేధ్యమును దీసిక
పోవుట యెట్టిదో యనాచారులు దురాచారులు నపరి
చిత్తులు దేవాలయములోనికిఁ బోవుట యట్టిది.

దేవాలయముల నజ్ఞులు చేయు నపచారముల పట్టిక.

ఇది దేవాలయప్రేక్షక హితచర్యనుబట్టి సవరింప
యును.

౧. వాహనముమీఁద నెక్కి కాని, పాదుకలు వేసిక
కాని దేవాలయమునకుఁ బోవుట. (దేవాలయమునకుఁ బొ
నపుడు కొయ్యపాదుకలే నిషిద్ధము లైనపుడు తోళ్ల చెప్పు
ముచ్చెలు మొదలైనవి వేసికొని దేవాలయములోపలికిఁ బో
దని వేఱుగఁ జెప్పవలయునా?)

౨. ఉత్సవకాలమందు దేవాలయమునకుఁబోయి భగవంతుని సేవింపకుండుట.

౩. స్వామిని జూచినవెంటనే ప్రణామము చేయకుండుట.

౪. ఒంటిచేతి నమస్కారము. (ఈ పాపమునకుఁ బ్రాయశ్చిత్తము చేతిని దెగఁగొట్టుటయని కృష్ణుఁడు చెప్పెను.)

౫. స్వామికెదుట నాత్మ ప్రదక్షిణము చేయుట (దేవునకుఁ బృష్ఠము గనఁబఱుచుట దుష్టము. రాజదర్శనమందే యిది దుష్టమైనపుడు స్వామిదర్శనమందుఁ జెప్పవలయునా?)

౬. అశుచిగా నుండునపుడును, నపరిశుద్ధుఁడుగా నుండునపుడును స్వామికి నమస్కరించుట. (తాఁకరానివారిని దాఁకిన నపరిశుద్ధుఁడు. పురుడు సూతకము వచ్చిన నశుచి.)

౭. స్వామికెదురుగఁ గాళ్లుచాఁపి కూర్చుండుట.

౮. స్వామికెదురుగఁ యోగపట్టమువలెఁ గట్టుకొని కూర్చుండుట.

౯. భగవంతునకెదురుగఁ బండుకొనుట.

౧౦. భగవత్ప్రసాదము దప్ప నేదైన భగవంతునకెదురు దినుట నములుట.

౧౧. అబద్ధములాడుట.

౧౨. బిగ్గరగ మాటలాడుట.

౧౩. భగవంతునెదుట వృథా ప్రసంగము చేయుట.

౧౪. ,, ,, నమంగళవాక్యములు నశ్లీలములు మాటలాడుట.

౧౫. భగవంతునెదుట నవ్వుట, యేడ్చుట, కలహించు నిగ్రహించుట, యనుగ్రహించుట, స్త్రీలతోఁ గేళీసూచకములైన మాటలాడుట, అపానవాయువు విడుచుట. పురుషు నల్లకంబళినిగాని యేవస్త్రముగాని ఱొమ్ముపైఁగప్పుకొని ప్రమము చేయుట, తలగుడ్డ ధరించుట, కుట్టినగుడ్డ ధరించుట, ః వలు కానివారు నెత్తిపై ముసుఁగు వేసికొనుట.

౧౬. పరనింద - పరస్తుతిచేయుట - శక్తిగలవాఁడయ్యు వంచనముచేసి గౌణోపచారము చేయుట, స్వామికి నివేదితముగాని దానిని దినుట. ఆ యా కాలములందు దొరకు ఫలముల లోభబుదిచే స్వామికి సమర్పింపకపోవుట.

౧౭. వేఱువిధముగ వినియోగింపఁబడిన పదార్థము శేషమును భగవంతునికి సమర్పించుట.

౧౮. భగవంతునికిఁ బృష్ఠభాగము కనఁబడఁ గూర్చుండుట

౧౯. భగవంతునిసన్నిధియందుఁ వైష్ణవునైనను, నవైష్ణ నైనను రాజునైనను గురువునైనను నుపచరించుట.

౨౦. భగవంతునియెదుట నేకాంతినిదప్ప మఱి యెవ్వ నైన సేవించుట.

౨౧. భగవంతునియెదుట గీతవాద్యనర్తనములను, బుః కథాప్రసంగములను మఱియు నిట్టివాని నధికారబలముచేతః బౌరుషముచేతను నడ్డగించుట.

౨౨. భగవంతుని నితరదేవతలతో సమానునిగ నెంచు

౨౩. క్షుద్రదేవతల గుళ్లయందుఁ బ్రవేశించి స్నానము చేయకయే స్వామిదేవాలయమందుఁ బ్రవేశించుట.

౨౪. విమానచ్ఛాయను ద్రొక్కుచుఁ బ్రదక్షిణముచేయుట, అట్లు ద్రొక్కక ప్రదక్షిణముచేయుటకు సాధ్యము కాని చోట నా ఛాయను మూఁడుభాగములుచేసి దూరముననుండు మొదటిభాగమందుఁ బోవచ్చును.

౨౫. ఆచార్యసమీపమందు మౌనము వహించియుండుట. తన్ను స్తుతించుకొనుట. ఇతరక్షేత్రములు దీనికంటె గొప్పవని స్తుతించుట. భగవంతుని నిందించుట.

౨౬. వెండ్రుకలు - గోళ్లు - ఎముకలు, అపరిశుద్ధపదార్థములు దేవాలయమందు వేయుట.

౨౭. దేవాలయములో నుమ్మివేయుట.

౨౮. దేవాలయమందును, దానికి సమీపప్రదేశమందును మలమూత్రములు విసర్జించుట.

౨౯. దేహమునకు నూనెపూసికొని దేవాలయములోనికిఁ బోవుట.

౩౦. దేవాలయమందుఁ దాంబూలము నుమ్మివేయుట.

౩౧. స్మశానమునకుఁ బోయికాని, శవము వెంటఁ బోయికాని, వచ్చి స్నానముచేయక స్వామినిదర్శించుట.

౩౨. శవమును మోచి వచ్చి స్నానముచేయక దేవాలయమందుఁ బ్రవేశించుట.

౩౩. నిమంత్రణ భోజనానంతరము భగవంతు నర్చించుట.

౩౪. భగవత్సన్నిధియందు వెలిఁగింపఁబడిన దీపములను వేఱుచోట్లకుఁ దీసికొనిపోవుట. వానిని దనకార్యమునకై యుపయోగించుట. యార్పుట.

౩౫. భగవత్సన్నిధిలో భగవత్కథలను జెప్పునపు డనాదరముతో వినకపోవుట. ఇతరుల వినకుండఁజేయుట.

౩౬. వేఱుదేవతల పూజకొఱకై నియమించిన పుష్పములతో భగవంతునిఁ బూజించుట.

౩౭. భగవంతునిఁ బూజించుటకై యుద్దేశించినపూలను ఫలాదులను వాసన ద్రవ్యములను వాసనచూచుట.

౩౮. భగవత్సేవచేయుటకై భక్తితోవచ్చిన చండాల పతితాదులను దేవాలయ సమీపమందుఁ దాఁకినచో స్నానము చేయుట.

౩౯. ఉత్సవాదులందు స్పర్శశంకచే స్నానముచేయుట.

౪౦. భగవద్విగ్రహమును లోహమయమని శిలామయమని యెంచుట. తనయాచార్యుని మనుష్యునిగ నెంచుట.

౪౧. భగవత్ప్రసాదమును సామాన్యాన్నమని, తీర్థము నీళ్లని యెంచుట పాఱవేయుట.

౪౨. విశేషించి వేదాధ్యయనముచేయుట.

౪౩. పొరపాటువలనైన నెత్తురు దాఁకుట. హింసచేయుట.

౪౪. చర్మము కొమ్ములు మొదలైన యపవిత్రవస్తువుల తోఁ జేసిన పదార్థములను గుక్కలు మొదలైనవానిని దేవా లయములోనికిఁ దీసికొనిపోవుట.

౪౫. దేవునికి బలపీఠమునకు నడుమఁ బోవుట. శివా లయమునందు నందిశంకరులనడుమఁ బోరాదు.

౪౬. దర్శనానంతరము స్వామికిఁ బృష్ఠభాగము కనఁ బడునటులు వెడలివచ్చుట.

౪౭. దేవాలయములోపల స్వార్థముగఁ గామక్రోధలోభ ములకు లోపడుట.

౪౮. ప్రసాదమును దిని భుక్తశేషమును చేతులను దేవా లయమున గుంజలకు గోడలకు రాచుట. దేవాలయము దేవుని దేహము.

౪౯. దేవునకై యుద్దేశించిన పాత్రములను వస్త్రాదులను స్వప్రయోజనమునకై వాడుకొనుట.

౫౦. దేవునకు హారతియిచ్చిన కర్పూరము వెలుఁగు నపుడు దాని నార్పుట. ఆఱిపోవునట్లు నీళ్లలో వేయుట.

౫౧. సంభోగానంతరము స్నానము చేయక, మలమూత్ర విసర్జనానంతరము పాదప్రక్షాళనా చమనములు చేయక దేవాల యము లోపలికిఁ బోవుట.

౫౨. i. కల్లు సారాయము త్రాగి కాని, యభిని గంజాయి తినికాని, ii. తాంబూలము నములుచుఁగాని iii. పొగచుట్ట త్రా గుచుఁగాని దేవాలయములోపలికిఁ బోవుట. వీరు i. పిశాచము

లుగను ii. నెమరువేయు పశువులుగను iii. క్రొఱవి దయ్యము
గను బుట్టుదురు.

౫౩. దేవాలయమున నెత్తుగానుండు నాసనమునఁ
ర్చుండుట.

౫౪. దంత ధావనముచేయక పాఁచినోటితో దే
సమీపించుట.

౫౫. నీలవస్త్రమును, రక్తవస్త్రమును ధరించి స్వా
సన్నిధికిఁ బోవుట.

౫౬. చీఁకటిలోఁగాని నల్లగుడ్డ ధరించికాని స్వా
దాఁకుట.

౫౭. కుక్కను దాఁకివచ్చి స్వామి కేదైన సమర్పించు

౫౮. పందిమాంసము గానుగుపిండి దిని స్వామికి న
స్కరించుట.

౫౯. దీపమును దాఁకి స్వామిని దాఁకుట.

౬౦. పూలు సమర్పించుటకుముందు ధూపసమర్పించు

౬౧. భేరి వాయింపక స్వామిని మేలుకొలుపుట.

ఇవి యన్నియు దేవాలయములందుఁ జేయరాని కా
ములు.

శ్రీ వరాహపురాణమునఁ జెప్పఁబడిన ప్రకార మపచా
ములవలనఁ గలుగు పాపములకు శిక్షలు వివరించెదను.,

దేవాలయమునందలి గీతవాది త్రనృత్త పుణ్యక
కాలక్షేపాదుల నెవరు లోపింపఁ జేయుదురో వా రిరువదియొ

నరకములు బాధపడి మఱుజన్మంబున గాడిదలై పుట్టుదురు. ఆవల నేడుజన్మములు పందులై పుట్టుదురు.

వస్త్రము కప్పుకొని నమస్కరించువాఁడు మూఁడుజన్మములందు గుష్ఠరోగి యగును.

నల్లకంబళి చుట్టుకొని నమస్కరించువాఁడు పదునాలుగు జన్మములు చండాలుఁడగును. దేహమునకుఁ జమురు రాచుకొని కాని పావుకోళ్లు చెప్పులు ముచ్చెలు మొదలైన పాదరక్షలు వేసికొనికాని దేవాలయము ప్రవేశించువాఁడు మూఁడుజన్మముల బల్లియగును. గోళ్లు-వెంట్రుకలు-ఎముకలు మొదలయినవానిని దేవాలయములో వేయువాఁ డిరువదియొక్క నరకము లనుభవించి యేడుజన్మంబుల మక్షికమై పుట్టును. దేవాలయములోపలఁ దాంబూల ముమియువాఁడు భూతప్రలయమువఱకు నరక మనుభవించి యావలఁ గుక్కయై మూఁడుజన్మంబులఁ బుట్టును. దేవాలయమున నుమ్మివేయువాఁడు క్రిమిభక్ష్య నరకమునఁ బడి పురుగులు తన్నుఁ దినుచుండ బాధపడుచుండి యావల నైదుజన్మంబుల విరిగి చెట్టైపుట్టును. స్మశానమునకుఁ బోయి యెవఁడు దేవాలయమునకు వచ్చునో వాఁ డేడుజన్మములఁ జేసిన పుణ్యము తత్క్షణమందే పోఁగొట్టుకొనును. ఆవల మూఁడుజన్మములు నక్కయై పుట్టును. దేవాలయములో మూత్రము విడుచువాఁడు మూత్రగర్త నరకమునఁ దలక్రిందుగాఁ బడి యావల నెనిమిదిజన్మములు పందిగాఁ బుట్టును. దేవా

లయమునఁ బురీషము (మలము) విడుచువాఁడు పరు
నిరువదియొక్కనరకము లనుభవించి మలములోఁ బురుగ
బుట్టుచుండును. వీనిఁగు వెంటఁబోయి దేవాలయముఁ జొ
వాఁడు తొమ్మిదిజన్మములు కాకియైపుట్టును. వీనుఁగును వె
దేవాలయము ప్రవేశించువాఁడు పదునాలుగుజన్మములు చ
లుఁడై యావల బోయువాఁడగును. శ్రాద్ధమున భుజించి
ర్శించువాఁడు పిచ్చుకయై యుడుమై పుట్టును. ప్రదక్షి
చేయక యెవఁడు విమానము నీడనుద్రొక్కి నిలుచునో వా
ముండ్లచెట్లయడవిలో ఫలపుష్పములు లేని పాడుచెట్టైపుట్ట
దేవాలయ సమీపమున మూత్రపురీషములు విడుచువా
పదివేలసంవత్సరములు రౌరవ నరకమునఁ బడును. ఆవల గ్ర
సూకరమగును. సమీపమందెవ్వఁడు వ్యర్థప్రలాపములాడ
వాఁడు తిత్తిరిపక్షియై యైదుజన్మములెత్తును. దేవాలయమం
దీపమార్పువాఁడును, మఱియొకచోటికి నెత్తుకొనిపోవువా
ను, బదునాలుగుజన్మములు గ్రుడ్డివాఁడైపుట్టును. దేవా
మందు భగవత్కథలు చెప్పుచుండ వినక యనాదరమున
పోవువాఁ డయిదుజన్మంబులఁ జెవిటిమూఁగయై పుట్టును. దే
లయమందు భగవత్సన్నిధాని గాళ్లుచాఁచి పండుకొనువాఁడ
గొల్లు నెంగిలి వేయువాఁడును భయంకరమైన మరుభూమిం
దుఁ బాడుచెట్టైపుట్టి యేడుజన్మములు చండాలుఁడును మూ
జన్మంబుల దరిద్రుఁడునై పుట్టును. ఇతరదేశతలకై తెచ్చి
పుష్పాదులతో భగవంతు విష్ణునెవ్వఁడు పూజించునో వాఁ

దేవాలయమందే రెండుజన్మములు కప్పగాఁబుట్టి యావల శూద్రత్వమును బొందును. క్షుద్ర దేవాలయములకుఁ బోయి స్నానము చేయక విష్ణ్వాలయము నెవఁడు ప్రవేశించునో వాఁడిల్లిల్లు బిచ్చమెత్తి తినువాఁడై బిచ్చముపుట్టక దరిద్రుఁడై యావలఁ బదునైదుజన్మములఁ జండాలుఁడగును. క్షుద్రదేవతలతో సమానునిఁగ నెవఁడు విష్ణువునుజూచునో వాఁడు పదునాలుగుజన్మములఁ జండాలుఁడగును. దేవపూజకై తెచ్చినపూలను నెవఁడు మూచూచునో వాఁడు మూఁడుజన్మములఁ గుష్ఠరోగియగును విష్ణుసేవార్థమైవచ్చి విష్ణ్వాలయ సమీపమందుండు చండాలురను బతితులనైనను దాఁకి స్నానము చేయువాని యొక్కయు, భగవంతుని యుత్సవవేళ నితరులఁ దాఁకితిమే మోయని సందేహించి స్నానము చేయు వానియొక్కయుఁ బితరులు తత్క్షణమే నరకమునఁ బడుదురు.

కొందఱు బ్రాహ్మణనామధారులే చొక్కాలు తొడిగికొని దేవుని సన్నిధానమునకువచ్చి యిచ్చిన గంధమును స్త్రీలవలెఁ గంఠమునకుఁ బూసికొందురు. జుట్టు కత్తిరింపులవార పూలను జెవిలోఁ జెక్కుదురు.

శ్లో. కర్ణేపుష్పం, గళేగంధం, కేశానాం తులసీదళమ్
యావద్ధారయతేవిప్రో, తావచ్ఛూద్రో నసంశయః ।

చెవియందుఁ బుష్పమును, గళమున గంధమును, వెండ్రుకలయందుఁ దులసీదళము నెంతవఱకు బ్రాహ్మణు ధరించునో యంతవఱకు వాఁడు శూద్రుఁడే. సందేహము లే

ప్రజలు తత్త్వమును బోధించువారు లేక యజ్ఞులై ం
చారములు చేయుచున్నారు. పుణ్యపాపములు తెలియఁజె
నచో వారు చక్కఁబడుదురను ధైర్యము నాకుఁగలదు. సహ
మీఁదఁ బ్రజలు మంచిచెడ్డలు చెప్పినఁ దెలిసికొను తెలివి
వారును భక్తివిశ్వాసములు గలవారునైయున్నారు. విజ్ఞులన
కొనువారును, విపరీతవేదాంతులును వారిశిష్యులు నమ్మ
గఁ జెడుదురు.

శ్లో. కలౌ పంచ సహస్రాంతే, జాయతే వర్ణసంకరః
కలౌ దశ సహస్రాంతే, విష్ణు స్త్యజతి మేదినీమ్.
(ఆర్యకథానిధి ౨-వ భాగమునఁ గలియుగలక్షణవ
జూడుఁడు.)

అన్నట్లు కలియుగమునఁ బదివేలయేండ్లకు విష్ణ్వాల
ములు పాడుపడును. గంగమ్మలు, పోలేరమ్మలు, ముఖ్యదేవ
మంత్రతంత్ర పూజలులేని భజనమందిరములు నుహాదేవా
ములై వెలయఁగలవు. వీని సూచనలు కానవచ్చుచు
దేవాలయమున స్వామిసన్నిధిలోఁ జేసినను, దనయింటఁ
ము పెట్టిచేసినను నొకటే యనుజ్ఞానము మనవారియందంకు
నది. దీనికి నిజమైనకారణము లోభముగాని సర్వాత్మక (
జ్ఞానముగాదు. విష్ణ్వాలయములు పాడుపడుటకు ముఖ్యక
భూతు లర్చకులు-నధికారులు ధర్మకర్తలు కమిటీదారులు
దురుకాని యితరులుగారు. ఈ విషయ మిప్పటికి నప్రస్తు
కావున నింతతో విరమించెదను.

ఎప్పుడో యేమో కాఁబోవునని యిప్పుడే భగవత్కార్యములు సత్కార్యములు చేయుట చేయించుట మానరాదు. చచ్చుట నిజమని యందఱెఱుంగుదురుకదా అట్లుండియు నే కార్యములను మనుష్యులు మానిరి? తుచ్ఛములైన కామ్యకర్మములే కర్తవ్యములని చేయుచు భగవత్కార్యములఁ జేయ మానవచ్చునా? భగవత్కార్యములు చేయువారు చేయించువారు నెన్నఁటికిఁ జెడరు. వారికి దుర్గతులును లేవు. "న మే భక్తః ప్రణశ్యతి" "న హి కల్యాణకృత్కశ్చిత్, దుర్గతిం తాత గచ్ఛతి" యని శ్రీ కృష్ణభగవానులే సెలవిచ్చిరిగదా. కార్యము కాలాంతరమునం జెడినను దానిని జేసినవానికి సత్ఫలము తప్పదు.

ఈ కాలమున భక్తిప్రపత్తులు తప్పఁ దక్కిన మార్గములసాధ్యములు. అంతటి జితేంద్రియుఁడు నాయూథుఁడు కోటికొకఁడైనఁ గలఁడో లేఁడో. కావున బాగుపడఁ గోరిన బుద్ధిమంతులు భక్తిప్రపత్తిమార్గ నిష్ఠులై భగవత్కైంకర్యములఁ గావించుచు భగవదాలయములకుఁ బోవుచు, శ్రద్ధాభక్తులతోఁ శుచులై భగవంతు దర్శించుచుఁ దద్ధ్యానభజనసంకీర్తనాలాపాదుల సంసార మహాసాగరమును దరింతురుగాక. మనుష్యత్వము-భక్తి-సాధుసంగమము పూర్వపుణ్యవిశేషంబునఁ గాని లభింపదు. పాపాత్ములకు భక్తి రుచింపదు. వేదాంతులమని యాపదముమాత్ర మెఱింగిన కొందఱు భ్రష్టులు, భ్రష్టముండలు మేము దేవాలయములకుఁ బోము దానధర్మములు చేయము. అజ్ఞానకారణములగుటచే నివి పునర్జన్మకారణము లని మొఱుగుచుందురు.

ద్వి. వినయవిద్యలుగల విప్రునియందు,
ననఘ! ధేనువునందు, హస్తులయందుఁ
గుక్కలయం, దపి కూడుగా నండి
మెక్కెడిజనులందు, మేకొనితుల్య
భావంబుగలవారు పండితుల్ సుమ్మి.

౫-వ అధ్యా. భగవద్గీత

శ్లో. విద్యావినయసంపన్నే, బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవశ్వపాకేచ, పండితాస్సమదర్శినః

అన్నట్లు లన్నియు భగవదావాసస్థానములను జ్ఞాన గలవారికి నన్నియు సమానములు గాఁగదా కనఁబడవలయు అట్లైన వీరుభార్యలను జూచిన దృష్టితోనే తల్లులను బుత్రిక జూచుచు వారును భగవంతులనియే వారితో సంభోగింతు లేక వీరినిజూచిన దృష్టితో వారినిజూచి సంసారము మానుక దరా? సర్వమీశ్వరకళయను భావముగలవారై భగవంతు నమస్కరించినట్లు భార్యను గుక్కను గాడిదను సమానము జూచి వానికి నమస్కరించెదరా? అట్లుచేయని వారిమాఁ చెప్పుదురేని వారుదొంగలు పరాత్మవంచకులు నగుదురు. సర్వ సమదృష్టి గలవారు మాత్రమే యీ మాట చెప్పనర్హు అట్టి సమదృష్టి స్థిరపడినవారు దేవాలయములకు రాకుండి విగ్రహములఁ బూజింపకుండినను దానధర్మములు చేయక నను దోషములేదుగాని తక్కిన వారటు చేయకుండినఁ ప్ర త్యవాయముగలదు. వారైనను బతనభయము వదలునట్లు

గా దేహపాతమువఱకుఁ జేయుటే బాగని శాస్త్రములు చెప్పుచున్నవి. అట్టివారి విషయమునసే యట్టి విధులుండఁ దక్కిన వారిమాట చెప్పనేల? వాస్తమున వీరు జ్ఞానులనియే యంగీకరింతము. జ్ఞానులకు దానము పాపావహమా? దానమేకం కలౌయుగేయని లేదా. మరల జననకారణమైన పుణ్యకార్యములు చేయుటయందే దానము ప్రశస్తమైనయెడల జననమరణముల నశింపఁజేయు భగవత్కార్యములకుఁ గా దానముచేయుట కారానికార్యమా? వీ రట్లుచెప్పుటకు లోభము కారణముగాని జ్ఞానముకాదు. అంకులు, బొంకులు, టకటొంకులు వీరికి నిత్యకృత్యములు కావున వీరు రామాయణము అంకు, భారతము బొంకని వనరుచుందురు.

అంధతామసనరకమున వీరు చిరకాలము బాధలఁబడి శుష్కదరిద్రులై కట్టబట్ట దినఁ బిండములేక శ్రమింతురు.

శ్లో. దైవే మంత్రే ద్విజే తీర్థే, దైవజ్ఞే భేషజే గురౌ
యాదృశీ భావనాయత్ర, సిద్ధిర్భవతి తాదృశీ ॥

దేవునియందును మంత్రతీర్థగుర్వాదులందు నెవరి కేభావముగలుగునో ఫలమట్లులే యుండును. కావున విగ్రహాదులందు భగవద్బుద్ధి గలవారికి భగవత్ప్రాప్తికలుగును. పాషాణబుద్ధిగల వారికిఁ బాషాణత్వప్రాప్తి కలుగును. ఏకలవ్యుఁడు సాక్షి.

శ్లో. మర్త్యబుద్ధి ర్గురౌయస్య, శివలింగే దృషన్మతిః
శబ్దబుద్ధి స్తు మంత్రేషు, సఖలు బ్రహ్మహాభవేత్

పరాశరుఁడు.

గురువును మనుష్యమాత్రుఁడనియు, శివలింగాది వి
హములను శిలలనియు, మంత్రములు శబ్దమాత్రములని
నెవఁడుతలఁచునో వాఁడు బ్రహ్మహత్య చేసినవాఁడగును.

శ్లో. శివవిద్యా గురూణాంచ, భేదోనాస్తి కథంచన
శివేమంత్రేగురౌ యస్యభావనా, సమ్యశీభవేత్
భోగో మోక్షశ్చ సిద్ధిశ్చ, శీఘ్రంతస్య భవేద్ధ్రువమ్ ॥

మాధవీయము.

ఇట్లన్ని మతములవారు నన్ని శ్రుతిస్మృతీతిహాసపుర
ములు నేకకంఠముతోఁ జెప్పుచుండ విగ్రహారాధకులు మం
లనువారికంటె మందులెవరు? లజ్ఞానముగలవారికైనను మీ
వ్రాసినదే చాలును. జ్ఞానహీనులకు వైతండికుల కిఁక నింత
సియుఁ బ్రయోజనము లేదు - కావున ఉద్ధవుఁడు కృష్ణునిత
జెప్పిన వాక్యములు. ‹‹శ్రవణామృతంబును బరమమంగళ
నగు నీ భూలోకలీలల నాలకించి నరులు విషయాసక్తివిడిచి నిన
శ్రయింతురు. శయ్యాసనాటనస్థాన స్నానక్రీయా భోజనా
లందు నాత్మప్రియుండవైన నిన్ను భక్తులమైన మేమెట్లు వి
యుండఁగలవారము. నీవు భోగించివిడిచిన మాల్యాలంక
భోజనాదులను దాసులమైన మే మనుభవించి నీ మాయను ని
ంగఁ దరింతుము. దానికై ప్రత్యేకప్రయత్నం బనావశ్యకం
గంబరులు, కౌపీనమాత్రధారులు, నుపవాస వ్రతకర్శితు
నూర్ధ్వరేతస్కులు, రాగద్వేషవియుక్తులు, పాపరహితు

సన్న్యాసులు, బ్రహ్మలోకంబునకుఁ జనుదురుగాక మేమో కర్మ మార్గ ప్రసక్తులమై నరలోక విడంబనార్థంబు నీవు కావించిన కార్యములు-పలికినపలుకులు-నడకలు-నవ్వులు-చూపులు స్మరించుచు స్మరింపఁజేయుచు ననాయాసంబుగఁ దమం బతిక్రమింతుము" ఏకాదశస్కంధము. భక్తిప్రాశస్త్యము - మేలుకొలుపు చదువుఁడు.

శ్రీ భాగవతమందలి యీ వాక్యముల ననువదించి భగవంతునకు భక్తులకు - భక్తురాండ్రకు సాష్టాంగ నతిశతంబులు గావించి యింతటితో విరమించెదను.

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు.

వాసుదాసుఁడు.

[illegible]

[illegible]

ప్రథమానుబంధము.

South Indian shrines. Page. 16.

"We may state that in the grandeur of the Mass shrines and in the exquisite sculptures, which strike imagination in a way which could not be done by a other means, the temples of Southern India taught the p ple for centuries lessons of purity and devotion" Page

Even an atheist cannot deny that the Hindu temp contribute to the health of the inhabitants of the pla Page 10.

Temples are considered to be hallowed ground. T are the great teachers of piety to all classes of pers They are the centres from which divine blessings issue the deserving; hence they are said to promote jus throughout the land.

It is also laid down that so long as these ancient in tutions are duly maintained by the ruling race there be prosperity in the country and famine will not visit land. These sacred shrines, by the splendour of their m sive structure and the fine sculptures to be found ther prompt the worshippers to lead a life of purity and de tion.

The Pope in his telegram to Emperor William on destruction of Rheims cathedral says:—

"When you destroy the temples of God, you prov ne divine ire before which the most potent armies l ll power."

"The real occupier, the Living Idol, in all the temples is one and the same Self Atma. That Self is thoroughly indifferent about the temple and its management. He finds, under all circumstances, eternal bliss and peace within Himself. The servants of the temple are looking after its upkeep.

The superintending officer in the temple, the Manager, the trustee, is the Sense of Individuality. His immediate subordinate officer is the general Accountant, the mind......The accountant has under him a number of Suppliers to the temple, the Desires. For receiving their supplies, the five senses of hearing, seeing, feeling touching. tasting and smelling Gnanendriyas have been appointed. There are also certain workmen, the five Karmendriyas the organs of action, namely, the organ of speech, hands, legs, and the two organs of discharge and excretion, appointed respectively to communicate outside the temple the orders and wishes of the Manager, to go about in the world and gather supplies and to work in the temple itself by cleaning it. Such is the establishment in the well organised temple, Man's person.

The building consists of several divisions, the grossest or most external of which is the physical body. In this portion of the temple you have the entrance gates of the business quarters of the receivers of supply, the five senses, and certain parts of this portion are severally allotted for the workmen, the Karmendriyas. Immediately inside this external portion there is the second division in which the suppliers of the temple, the desires, are busy with their work. Passing through the second into the interior we reach the third portion where the genera

accountant, the mind holds his office. Almost every busi ness connected with the Management of the temple is practically transacted here. Beyond this portion there is the fourth region, Thuriyasthanam, which is the abode of the Self or the God of the temple, the Garbhagriha of the living Idol. There too Almighty, the Ideal of Ideal exists, shines in all His Divine Glory." Atma vidya by G. Ramachendra Ayyar. B. A., B. L.

---

## దృష్టి సూనుబంధము.

We know that wood and iron and stone have their own respective characteristic radiations, but the point to be emphasized just now is that they are all capable of absorbing human influence and then pouring it out again. What is the origin of that feeling of devotion, of reverential awe, which so permeates some of our great cathedrals that even the most hardened cook's tourist can not entirely escape it. It is due not only to the historical associations, not only to the remembrance of the fact that for centuries men have met here for praise and prayer, but far more to that fact itself and to the conditions which it has produced in the substance of the fabric.

To understand this we must first of all remember the circumstances under which those buildings were erected A modern brick church run up by contract in the shortest possible time has indeed but little sanctity about it; but in Mediaeval days faith was greater, and the influence of the outer world less prominent. In very truth men prayed as they build our great cathedrals, and laid every stone as

though it had been an offering upon an altar. When this was the spirit of the work, every such stone became a veritable talisman charged with the reverence and devotion of the builder, and capable of radiating those same waves of sensation upon others, so as to stir in them similar feelings. The crowds who came afterwards to worship at the shrine not only felt these radiations, but themselves strengthened them in turn by the reaction of their own feelings.

Still more is this true of the interior decorations of the church. Every touch of the brush in the colouring of a triptych, every stroke of the chisel in the sculpture of a statue, was a direct offering to God Thus the completed work of art is surrounded by an atmosphere of reverence and love, and it distinctly sheds these qualities upon the worshippers. All of them, rich and poor alike, feel something of this effect, even though many of them may be too ignorant to receive the added stimulus which with its artistic excellence gives to those who are able to appreciate it and to perceive all that it means.

The sunlight streaming through the splendid stained glass of those mediaeval windows brings with it a glory that is not all of the physical world, for the clever workmen who built up that marvellous mosaic did so for the love of God and the glory of His saints, and so each fragment of glass is a talisman also. Remembering always how the power conveyed into the statue or picture by the fervour of the original artist has been perpetually reinforced through the ages by the devotion of successive generations of worshippers, we come to understand the inner meaning of the great influence which undoubtedly does radiate

from such objects as have been regarded as sacred for centuries."

"From these considerations it is evident that these various ecclesiastical properties, such as statues, pictures and other decorations, have a real value in the effect which they produce upon the worshippers, and the fact that they thus have a distinct power, which so many people can feel, probably accouuts for the intense hatred felt for them by the savage fanatics who miscalled themselves puritans."

In all these splendid mediaeval buildings the sentiment of devotion absolutely and literally exudes from the walls, because for centuries devotional thought-forms have been created in them by successive generations."

## Temples.

Among Hindus the vaishnavite has a devotion quite as profound as that of any christian, though unfortunately it is often tainted by expectation of favours to be given in return. But the Hindu has no idea of anything like combined worship. Though on great festivals enormous crowds attend the temples, each person makes his little prayer or goes through his little ceremony for himself and so he misses the enormous additional effect which is produced by simultaneous action.

Regarded solely from the point of view of charging the walls of the temple with devotional influence, this ·lan differs from the other in a way that we may perhaps ıderstand by taking a physical illustration of a number ; sailors pulling at a rope. We know that, when that is ›eing done, a sort of chant is generally used in order to

ensure that the men shall apply their strength at exactly the same moment; and in that way a much more effective pull is produced than would be achieved if each man put out exactly the same strength, but applied it just when he felt that he could, and without any relation to the work of the others.

Nevertheless as the years roll by there comes to be a strong feeling in a Vaistnavite temple as strong perhaps as that of the Christian, though quite different in kind. Different again in quite another is the impression produced in the great temples dedicated to Siva. In such a shrine as that at Madura for example, an exceedingly powerful influence radiates from the holy of holies. It is surrounded by a strong feeling of reverential awe, almost of fear, and this so deeply tinges the devotion of the crowds who come to worship that the very aura of the place is changed by it."

Extract from the Hidden side of things by C. W. Leadbeater.

ఇది త్రిపురసుద్దను వస్తుప్రచ్ఛన్న భాగమను గ్రంథము నుండి యనువదింపఁబడినది. నేను వ్రాసినదానికిఁ బ్రమాణముగ దీనిని గ్రహించినవాఁడనుగాను. మన శాస్త్రములందును ననుభవమందు నుండునవి నేను వ్రాసితిని. పాశ్చాత్యులు దేవాలయ నిర్మాణవిధానములు, నందలి యాచారములు తంత్రములు హిందువులవలన నేర్చుకొన్నవనియు నమంత్రకములైన తమ తంత్రములు హిందువుల తంత్రములతోఁ బోల్చినపుడు నిర్జీవికి జీవికిఁ గల తారతమ్యము గలవనియు నీయాన రొమ్ముఁగఁజు

కాఁబోలు. మనోవ్యాపారము మంత్రవంతమైనపు డెక్కువ బలిష్ఠమగుట యీయన యోజించినవాఁడుగాఁడు: చర్చ్ల శిల్పులనియతి మనశిల్పులనియతికి ఛాయగాఁ గనఁబడుచున్నది. అది యెట్టులయిననగుఁ గాక. చర్చ్లయందువలె విష్ణ్వాలయములయందు సంఘముగఁ జేరి పూజించుట లేదఁట. పదిమంది చేరి యేకకాలమునఁ బూజనొక్క పూనికతో బరువైన మొద్దు నీడ్చుట వంటిదఁట. ప్రత్యేకపూజ యొక్కొక్కఁడే యీడ్చుట వంటిదఁట. దానివలన దానికంటె నిది దుర్బలమఁట. శివాలయములందు భక్తులు భయముచేత భక్తిభావనలఁ జెఱుతురఁట. ఈయన వ్రాఁతవలనఁ జర్చ్లందు మహిమ శిల్పుల భక్తి-చూడ వచ్చినవారి భక్తివలన నచ్చునదిగా మాత్రముతోఁచెడి. మనలో శిల్పశక్తి-మంత్రశక్తి-ప్రజలభక్తి యిన్నియుఁ గలయుచున్నవి మంత్రాధీనంతు దైవతమ్మని కలదుగదా. కావున మంత్రహీనమైనది ప్రాణహీనమైనదే. విష్ణ్వాలయములందు నారాధనకాలమందు వచ్చినభక్తుల దృష్టులు మనస్సులు దేవతామూర్తియందే యుండును. మంత్రపుష్పము స్తోత్రపాఠములు వేదపాఠములోనైనవి వచ్చినవారందఱు కలసియే చెప్పుదురు అవి రాని వారూరక వినుచుందురు కాని యిట్టి సమయములందుఁ బ్రత్యేక సమారాధనలు లేవు. ప్రతిఫలమునుగోరి భగవద్దర్శనమునకేగుట ప్రశస్తముగాదు. అయినను నార్తుఁడు జిజ్ఞాసువు అర్థార్థి జ్ఞాని యీ నలువురు నుదారులని తన వారనియే కదా భగవంతుఁడు-చెప్పెను భగవంతుఁడు తండ్రి. మనము బిడ్డలము-మన

సుఖదుఃఖములు తండ్రితోఁ జెప్పుకొనకుండిన మఱియెవ్వరితోఁ జెప్పుకొనవలయును. భక్తులవాంఛలఁ దీర్చుశక్తి చర్చిలయందు లేదు గావునఁ గోరువాఁడును లేఁడేమో. అంతియకాని క్రైస్తవులలోనుండు నార్తులకంటె నర్థార్థులకంటె యే మతమునఁ గలరు.

శివాలయములందుఁగాని విష్ణ్వాలయములందుఁగాని పాపాత్ములు భయపడుదురు. ఏల? వారి పాపజ్ఞానమే వారికి భయకారణము. అంతియకాని సంహారణముగ శివుఁడువచ్చి తన గొంతుపిసుకునని యెవ్వఁడు భయపడఁడు. వాస్తవముగ వీని పాపమే వీనికిఁ గీడు కలిగించునుగాని భగవంతుఁడు కలిగింపఁడు. నీ పాపఫలము నీవనుభవింపుమనును. దొంగతనము చేసి పట్టుపడి వచ్చినవాఁడు ప్రభువునకు జడియునా? శిక్షయందును జడియుదురా? ఈ జడుపు సంస్కరణమునకుఁ గారణమగుచున్నది.

---

## తృతీయానుబంధము.

" The origin of image-worship in India, appears to be very ancient and its causes are not exactly known. Many believe it to be the result of the followers of Gowtama Buddha adoring their master and worshipping him in the form of images on his apotheosis after his death. However there are indications of the prevalance of image worship among the Hindus long before the time of Gowtama Buddha The employment of an external object to concentrate the mind upon, in the act of meditation in carrying on the

practice of Yoga is, in India, as old as yoga itself. Pat jali defines Dharana or fixity of attention as " The pro of fixing the mind on some object well defined in spac This process is, as he says, of two kinds, in conseque of this defined space being external or internal. The exte object defined in space consists of the circle of the navel ( nabhi chakra), the heart and so on. The fixing of the m thereon is merely directing its exsistance to be ther There is indeed ample evidence to show that the practice yoga in this country is much older than the time of Pa jali. Vachaspati Misra, a commentator on Vyasade Bhashya on Pathanjali's Yoga sutras mentions a great s Hiranyagarbha, as the founder of the Yoga doctrine whi he adds, was simply improved upon and promulgated Pathanjali as evidenced by the use of the word Anusasan in Pathanjali's first Aphorism 'Atha Yoganusasnam'. This sage Hiranya Garbha and his successor Varshaganya, Yaj avalkya, are alluded to by Ramanuja and other later teach of Vedanta and Sankara actually quotes some Yoga Aphor ms which are not found in the work of Pathanjali but lo older than his time. It is therefore clear that image worsh among the Hindus was contemparaneous with, if not old than, the developement of Yoga system, which as we ha seen dates from before the age of Pathanjali who has be assigned by scholars on good evidence to the second centu B. C. There is no doubt that the Yoga system is even old than the time of Buddha because Buddha himself was decl red to have been initiated into its practice in the earlier stag of his scerch after enlightenment and truth and it may b taken that this fact is evidenced by sculptured representatior Buddha in the style of the Gandhara School as an emaci

ted person almost dying under the stress of the austerities he practiced.

Again, Panini to whom certain orientalists assign a date some where about 6th century B. C. mentions in one of his grammatical aphorisms, (V. 3,99) that "Likenesses not to be sold but used for the purposes of livelihood do not take the termination kan." The word he uses to denote an image in a nearly preceding (V. 696) aphorism is Pratikriti, the literal meaning thereof is anything made after an original. Commentators on this aphorism understand these unsalable reproductions to be divine images. Evidently then, there were images of Gods and Goddesses in the days of Panini which were apparently not sold in the bazars but were nevertheless used for purposes of making a living. This would indicate that the possessors of these images were able to utilise them as religious objects which were so sacred as to justify the gift of alms to those who owned and exhibited them. Finally the images of gods as they laugh, cry, sing dance, perspire, crack and so forth are mentioned in the Adbhuta Brahmana, which is the last of the six chapters of Shud Vimsa Brahmana, a supplement to the Pancha Vimsa Brahmana. As regards the existence or otherwise of image worship in the Vedic period in the history of India, opinior is divided among European savants. Prof. Max Mulle (chips from a German Workshop I. 35) answers the questio 'Did the Vedic Indians make images of their Gods'? in tl negative. He says "The religion of the Veda knows idols. The worship of idols in India is a secondary formatio a later degeneration of the more primitive worship of ideal Gods." On the other hand Dr. Balenson finds in hymns clear reference to the images of Gods (Journal of t

German oriental Soc XXII 587ff) From the common appelation of the Gods as Divonaras 'men of the sky' or simply naras (later?) 'men' and from the epithet Nripesas 'having the form of men,' *R*. V. iii 4, 5 we may conclude that the Indians did not merely in imagination assign human forms to their Gods, but also represented them in a sensible manner.'

Image worship seems to have become common in the time of Yashka. In his Nirukta, he says. "We are now to consider the forms of the Gods. One made of representation in the hymn makes them resemble men; for they are praised and addressed as inteligent beings. They are also celebrated with limbs such asthose of men."

Later on, Patanjali even gives in a casual manner an idea as to the images which were then commonly in use; He says in the Maha Bhashya what about such likenesses of Siva, Skanda and Visakha, which were known as Siva, Skanda and Visakha, and not Sivaka, Skandhaka, and Visakhaka?

In the Ramayana, we see mention of temples in Lanka (Bk VI. 39, 21) clearly evidencing the fact that there existed at least in South India, the worship of images enshrined in temples.

Thus there appears to be evidence enough to suggest that image worship was probably not unknown even to the Vedic Indian and it seems likely that he was at least occassionally worshipping his gods in the form of images, and continued to do so afterwards also. Such is the evidence as to image worship to be found in early Sanskrit Literature. It is desirable to direct our attention to actual Sculptures and to reference to images occuring in ancient inscriptions.

The oldest piece of sculpture, in South India distinctly Hindu in character, is as for as it is known now, the Linga at Gudimallam. From the features of the figure of Siva, carved thereon in half relief, from the ornaments worked out on the figure, from the arrangement of the drapery, from the battle-axe upon the shoulder; and many other characterestics it may be put down to belong to the period of Bhaurhat Sculpture, that is, to the 2nd century B. C. This remarkable piece of sculpture is interesting in two ways; it at once assures us of the exact nature of the early Linga worship and also affords us a lower limit of time in relation to the worship of Siva in the form of a Linga. From this Linga we may safely conclude that Linga worship is at least as old as 2nd century *B*. C.

Then, again, the inscriptions on a Garuda Stambha discovered in Besnagar quite recently, states that Heliodoras, the son of Dion, a Bhagavatha, who came from Taxila in the reign of the great king Antalkidas set np that Garuda Dhwaja in honour of Vasudeva. From this king Antalkidas various initial dates have been fixed, which range from B. C. 175 to 135. This is about the earliest known inscription mentioning Vishnu as Vasudeva; and from this we are in a position to assert that the worship of Vasudeva in temples in India cannot be later than the 2nd Century B. C. The following are some of the note worthy references to the iconographic aspect of the Vishnu cult in inscriptions :—The Udayagiri cave inscription of...........dhala, son of Vishnu dasa, grandson of Chchagala & Vassal of the Gupta king, Chandragupta II dated the Gupta Era 82 (A. D. 401–2) records the dedication of a rock-cut shrine to Vishnu... etc.

Extract from Elements of Hindu Iconography by T. A
Gopinatha Row Supt. of Archaelogy. Travancore State.

"Rev. C. F. Andrews says :—The Hindu religious hea
among the people shrivels up in atmosphere of dry abstrac
ions. It may be able in the future to eliminate gross
forms of divine representations ; but to eliminate divi
representation in and through form would appear to b
disastrous in the long run to Hindu faith. For, at the centi
of all, from the time of the Upanishads onwards the instin
has ever grown deeper that the Divine Spirit and the huma
spirit are ultimately one and that all nature is included i
that union." The Hindu.

V. Suryanarayana Rao,

High Court Vaki

Kovur.